


జూన్ 3న జరిగిన కవిత్వ శిక్షణా శిబిరంలో ప్రారంభోపన్యాసం చేస్తున్న సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి.

# సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ నిర్వహించిన కవిత్వ శిక్షణా శిబిరం దృశ్యాలు



శిబిరంలో నమోదు చేయించుకుంటున్న కవులు




ప్రాచీన కవిత్వంపై ప్రసంగిస్తున్న కేంద్రీయ విద్యాలయ ఆచార్యులు డా. పిల్లలమర్రి రాములు. చిత్రంలో సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ సభ్యురాలు శాంతిశ్రీ



కవిత్వం- దృక్పథంపై ప్రసంగిస్తున్న డా. అద్దేపల్లి రామమోహనరావు. చిత్రంలో సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ కోశాధికారి వి.వి.ఆర్. శాస్త్రి




కవిత్వం వస్తురూపాలపై ప్రసంగిస్తున్న సాహితీస్రవంతి ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి. చిత్రంలో సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఉపాధ్యక్షులు గేరా




కవిత్వ నిర్మాణంపై ప్రసంగిస్తున్న డా. సీతారాం. చిత్రంలో సాహితీస్రవంతి రాష్ట్ర కమిటీ సభ్యులు తంగిరాల చక్రవర్తి



శిక్షణా శిబిరంలో గ్రూపు వర్కులో ఔత్సాహిక కవులు



అద్దేపల్లి రామమోహనరావుకి పుస్తకాన్నిబహుమతిగా అందిస్తున్న మోతుకూరి నరహరి. చిత్రంలో సాహితీస్రవంతి నగర కమిటీ సభ్యులు వెంకటి. సీతారాం



కవిత్వ శిక్షణా శిబిరంలో పాల్గొని పాటలు ఆలపించి అలరించిన గాయనీ గాయకులు నాగశిరీష, నరేష్, ఎస్. నాగరాణి



80కి పైగా హాజరయిన ఔత్సాహిక కవులతో సీనియర్ రచయితలు

ఫొటోలు: గేరా

PRSVM02A139

సాహిత్య ప్రస్థానం
జూలై 2012
సంపుటి : 11 సంచిక : 07

# సందర్భం...

ఇది గురజాడ నూట యాభయ్యవ జయంతి సంవత్సరం. అలాగే ఆయన కన్యాశుల్కం నాటక ప్రథమ ప్రదర్శనకు నూట ముప్పై ఏళ్ళు. తెలుగువారు సగర్వంగా నిర్వహించుకోవలసిన సాహిత్య వేడుక ఇది. రవీంద్రనాథ్ టాగోర్. నూట యాభయ్యవ జయంతిని దేశమంతా పాటించింది. అనేక అంశాలలో గురజాడ కూడా ఆ కోవకు చెందిన మహాకవి, సంస్కర్త. కొన్ని విషయాల్లో మరింత ముందున్నట్టు కూడా అనిపిస్తుంది. ఆ మీమాంస ఎలా వున్నా గురజాడ నూటయాభయ్యవ జయంతిని, కన్యాశుల్కం నూట ముప్పయ్యో వార్షికోత్సవాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం సముచిత రీతిలో నిర్వహించడమే గాక జాతీయంగానూ, దానికి గుర్తుగా ఏవైనా కార్యక్రమాలు ప్రతిపాదించాలి. కవులు, రచయితలు, సాహితీ మిత్రులు తమ తమ పరిధుల్లో ఈ వార్షికోత్సవాలను నిర్వహించుకుని గురజాడ వారసత్వాన్ని మరింత ముందుకు తీసుకుపోవడానికి సమాయత్తం కావాలి.

. . .

సాహితీ స్రవంతిలో తొలి నుంచి చురుగ్గా పనిచేస్తున్న కవి, ప్రజా కళాకారుడు యాసలపు సూర్యారావు ఆకస్మికంగా మరణించడం చాలా విచారకరం. ప్రస్థానం ఆయనకు జోహారులర్పిస్తున్నది.

. . .

అంతర్జాతీయ ఖ్యాతిగాంచిన ఛాయా చిత్రకారుడు సునీల్ జేనా ఇటీవలే కన్నుమూశారు. స్వాతంత్ర పోరాటానికి కమ్యూనిస్టు ఉద్యమానికి సంబంధించి అనేక మహత్తర చిత్రాలు తీసి వాటిని చరిత్రలో నిల్చిపోయేలా చేసిన సునీల్ జేనా ఒక చారిత్రక సాక్షి. తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటంపై ఆయన తీసిన చిత్రాలను క్లోజప్ పేరుతో ప్రజాశక్తి ప్రచురించింది. అలాటి అత్యున్నత స్థాయి కళా స్రష్ట అస్తమయం ఛాయా చిత్ర ప్రపంచానికి ఒక పెద్ద వెలితి. ఆయనకిదే మా నివాళి.

. . .

సాహితీ స్రవంతి ప్రవేశపెట్టిన నూతన ప్రక్రియల్లో జన కవనం ఒకటి. అంతకు ముందున్న కొన్ని పదాల స్థానే ఈ ప్రక్రియ ప్రారంభమై ఇప్పటికీ పదేళ్ళు. పూర్తయ్యాయి. ఇప్పుడు జనకవనం అన్నది అందరికీ సుపరిచిత పదమై పోయింది. ఈ సందర్భంగా సిఐటియు మహాసభలను పురస్కరించుకుని శ్రమజీవులు సమస్యలు సమకాలీన పరిస్థితులపై జరుగుతున్న దశాబ్ది జనకవనంలో పాల్గొంటున్న వారందరికీ మా అభినందన.

ముఖచిత్రం :పెయింటింగ్: కరెన్ టార్లటన్

బొమ్మలు : చంద్ర, శివాజీ, వెంకటేష్

## ఈ సంచికలో...



సంపాదకవర్గం
తెలకపల్లి రవి (సంపాదకుడు)
కె.ఆనందాచారి
వొరప్రసాద్
వల్లభాపురం జనార్దన
కె. లక్ష్మయ్య, మేనేజర్

చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టీసీ కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
Prasthanam_ss@yahoo.co.in
www.prasthanam.com

కథ

# దేవుడికి సాయం



- కొల్లూరి సోమశంకర్

**ఉదయం 10 గంటలవుతోంది. లైబ్రరీలో పుస్తకాలు తీసుకుని, కరెంట్ బిల్ కడదామని అరకిలోమీటరు దూరంలో ఉన్న ఈ-సేవ కేంద్రం వైపు నడుస్తున్నాను. మే నెల మొదటి వారం కావడంతో ఎండ మండిపోతోంది. ఆటోగాని, బస్ గాని ఎక్కేంత దూరం కాదది. రోడ్డు కొద్దిగా ఎగుడుగా వుంది. కొద్ది దూరం నడిచానో లేదో, ఎవరో నన్ను పిలుస్తున్నట్లనిపించింది. పక్కకి తిరిగి చూశాను. రోడ్డు వారగా మూడు చక్రాల సైకిల్‌పైన ఓ వికలాంగుడు కూర్చుని ఉన్నాడు.**

"సార్, కాస్త ఏమనుకోకుండా బండి కొంచెం తోస్తారా! అప్ ఎక్కలేకపోతున్నాను" అన్నాడు అర్థింపుగా.

ఎటువంటి సంకోచం లేకుండా, 'పదండి, అంటూ' బండిని తోయడానికి ఉపక్రమించాను.

చేత్తో పెడల్ తిప్పుతూ "థాంక్యూ సార్, చాలామందిని అడిగాను. ఒక్కరు కూడా సాయం చేయడానికి ముందుకు రాలేదు. మీకు శ్రమిస్తున్నాను" అని చెప్పాడతను.

'ఫర్వాలేదు. నేను అటువైపే వెళ్ళేది. 'ఇందులో నాకు శ్రమేమీ లేదు. మామూలుగా అయితే వేగంగా నడుస్తాను. ఇప్పుడు కాస్త నిదానంగా నడుస్తాను అంతే!"

అతని కాళ్ళ కిందుగా ఓ చేతి సంచీ ఉంది. సమీపంలోని ఓ బ్యాంకుకి వెళ్ళాలని చెప్పాడతను. ఈ బ్యాంక్‌కి జనాల తాకిడి బాగా ఎక్కువ. అతను ఆగి ఉన్న ప్రాంతానికి దగ్గరే. కానీ మధ్యలో ఓ క్రాసింగ్ ఉంది. అక్కడ బాగా రద్దీగా ఉంటుంది. గ్రీన్ సిగ్నల్ ఉండేంత లోపు తాను ఆ క్రాసింగ్‌ని దాటగలనో లేదో అతని భయంట.

"మీరూ బ్యాంకు కేనా సార్?" అని అడిగాడు.

'కాదు. నేనింకా ముందుకు వెళ్ళాలి. ఈ-సేవ కేంద్రానికి.'

ఇంతలో క్రాసింగ్ వచ్చింది. సిగ్నల్ కోసం ఆగిపోయాం. తన పేరు చెప్పాడు.

'నా చిన్నప్పుడే ప్రమాదంలో కాళ్ళు పోయాయి. పెద్దగా చదువబ్బలేదండి. మహానుభావుడొకాయన ఈ చక్రాల బండి ఇప్పించాడండి... దానితో నేను వెళ్ళాలనుకున్న చోటికి వెళ్ళగలుగుతున్నానండి. నాకు బ్యాంకులో పనుందండి..'

'అలాగా'

'అందరూ మీలా ఉండరండి. దాదాపు పావుగంట నుంచి అడుగుతున్నా ఎవరూ సాయం చేయలేదండి. ఓ పక్క ఎండ అదిరిపోతుంటే, ఇంత ఎండలో నా బండి తోయడానికి ఎవరొస్తారా అని బాధపడుతుంటే, దేవుడు పంపినట్లుగా మీరొచ్చారండి.'

'ఇందులో మీరు అంతగా పొగడాల్సిందేం లేదు. మంచి పని చేసేందుకు అవకాశం వస్తే వదులుకోకూడదని మా పెద్దవాళ్ళు చెప్పారు. నాకా అవకాశం వచ్చింది. ఉపయోగించుకుంటున్నాను అంతే' అని చెప్పాను.

ఇంతలో ట్రాఫిక్ క్లియర్ అయింది. కొంచెం వేగంగా తోస్తూ, బండిని క్రాసింగ్ దాటించాను. అతనేదో అన్నాడు. కాని ఆ రొదలో వినిపించలేదు. బ్యాంకు ఆవరణలోకి ప్రవేశించే సరికి సుమారుగా పదిన్నర గంటలవుతోంది. శనివారం కావడంతో చాలామంది వచ్చి ఉన్నారక్కడ. ఎ.టి.ఎం. దగ్గర కూడా పెద్ద క్యూ ఉంది. అతన్ని బండితో సహా బ్యాంకు ఆవరణలోని గట్టు మీదకి చేర్చాను. అతను మరోసారి కృతజ్ఞతలు చెప్పాడు.



'ఫర్వాలేదు. నేను చేసింది చాలా చిన్న సాయం' అంటూ అక్కడ్నుంచి కదులుతుండగా రాఘవ ఎదురయ్యాడు. అతనీ బ్యాంకులోనే పనిచేస్తాడు. మా కాలనీలోనే ఉంటాడు. నేను అతన్ని విష్ చేశాను. అతను పలకరింపుగా నవ్వాడు.

నేను కథలు రాస్తానని అవి అప్పుడప్పుడు పత్రికలలో ప్రచురితమవుతాయని అతనికి తెలుసు. పరిచయమైన కొత్తల్లో చెప్పాడు నా కథలు చదువుతుంటానని. అప్పుడప్పుడు మా ఇంటికి వచ్చి సాహిత్య చర్చలు జరుపుతుంటాడు. మా ఇద్దరి మధ్య గాఢమైన మైత్రి లేదు. కాని భవిష్యత్తులో సన్నిహితమయ్యేంత పరిచయం మాత్రం వుంది. అయితే ఒకరోజు నేను అతనిని ఓ చిన్న సాయం చేయమని అడగడం అతనికి ఇబ్బందిగా అనిపించి మా మధ్య సంబంధాలు తెగిపోయే పరిస్థితి దాకా వెళ్ళింది. నాకా సంఘటన బాగా గుర్తు వుంది.

. . .

నేనొక పేద అమ్మాయి చదువుకి కొంత ఆర్థిక సాయం చేస్తున్నాను. ఆ అమ్మాయి కాలేజీ ఫీజు కట్టడానికి సమయం దగ్గర పడుతోంది. ఆ అమ్మాయి ఎకౌంట్లో డబ్బులు వేసేందుకు బ్యాంకుకి వెళ్ళి నగదు చెల్లించడానికి మా ఆవిడకి డబ్బులిచ్చి నేను ఆఫీసుకు వెళ్ళిపోయాను. తీరా మా ఆవిడ బయల్దేరుతుంటే ఉన్నట్లుండి ఒక్కసారిగా జ్వరం, నిస్త్రాణతట. అప్పుడు మా ఆవిడకి రాఘవ గుర్తొచ్చాడట. వెళ్ళి రాఘవని సాయం అడిగిందట. ఆ రోజు శనివారం. పని ఎక్కువగా ఉంటుందంటూ తానేమీ సాయం చేయలేనని కరాఖండీగా చెప్పేసాడట. 'కాస్త పరిచయం ఉంటే చాలు. అడ్వాండేజీ తీసుకుంటారు' అని వ్యాఖ్యానించాడట. చేసేదేం లేక, మా ఆవిడే ఓపిక చేసుకుని బ్యాంకుకు వెళ్ళి డబ్బు కట్టేసి వచ్చింది. వస్తూ వస్తూ డాక్టర్ దగ్గరికి వెళ్ళింది. ఇంటికి చేరిన తర్వాత నాకు ఫోన్ చేసి జరిగిందంతా చెప్పింది. ఆ తర్వాత పాపం తను ఓ వారం రోజుల పాటు జ్వరంతో బాధపడింది. ఈ సంఘటన తర్వాత రాఘవ కొన్ని రోజుల పాటు మా ఇంటికి రాలేదు. బజారులో కనపడ్డా నన్ను పట్టించుకోలేదు.

కొన్ని రోజుల తర్వాత నా కథ ఒకటి ఆదివారం అనుబంధంలో పడింది. ఓ పోటీలో దానికి రెండో బహుమతి వచ్చింది. అది చదివి రాఘవ మా ఇంటికి వచ్చాడు.

మా ఆవిడ అతనిని మామూలుగానే ఆహ్వానించి కూర్చోమంది.

రాఘవ నా కథలోని ఇతివృత్తాన్ని, కథనం నడిపిన తీరుని మెచ్చుకున్నాడు. నేను చిరునవ్వు నవ్వి ఊరుకున్నాను.

ఉన్నట్లుండి 'ఆ మధ్య మీ మిసెస్ బ్యాంకులో పనికోసం సాయం అడిగారు. నాకు కుదరదని మొహం మీద చెప్పేసాను. కానీ తర్వాత తెలిసింది. మీరో అమ్మాయి చదువు ఖర్చు భరిస్తున్నారని, ఆ అమ్మాయి ఫీజు కోసమే సాయం అడిగారని'. సాయం చేయగల అవకాశముండి కూడా కుదరదన్నందుకు నాకు తర్వాత సిగ్గనిపించింది. మీర చేసే సాయం ముందు, మీరు అడిగిన సాయం ఏపాటిది? దాన్ని కూడా కాదన్నందుకు ఏమనుకోకండి' అని అన్నాడు రాఘవ.

'ఫర్వాలేదులెండి. మరోసారి చేద్దురుగాని' అన్నాను.

అతను మా ఇంట్లో ఉన్నంత సేపు కాస్త గిల్టీగానే ఉన్నట్లు అనిపించింది. పది నిమిషాల తర్వాత వెళ్ళిపోయాడు. ఆ రోజు నుంచి మా సంబంధాలు మామూలుగానే కొనసాగుతున్నాయి.

. . .

రాఘవ పలకరింపుతో వర్తమానంలోకి వచ్చాను.

"ఏంటి సార్, బ్యాంకులో ఏమైనా పనుందా, నాకిచ్చేయండి, నేను చేసిపెడతా" అన్నాడు.



## జూన్ నెల పురస్కారాలు



### దోషఫలితం

కథకు........రూ.700/-

రచయిత : పాలకొల్లు రామలింగస్వామి

### ఆకుకూరలమ్మి

కవితకు.......రూ.500/-

రచయిత : కొండ్రెడ్డి వెంకటేశ్వరెడ్డి

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**
మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాదు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

'అబ్బే... ఏనేం లేదు. వస్తా...' అంటూ అక్కడి నుంచి కదిలాను.

కరెంట్ బిల్ కట్టేసి ఇల్లు చేరాను.

సాయంత్రం ఆరు గంటలకి రాఘవ మా ఇంటికొచ్చాడు. మర్యాదపూర్వకమైన పలకరింపులయ్యాక నేరుగా విషయంలోకి వచ్చేశాడు.

'మీరు చెప్పకపోయినా, పొద్దున్న మీరు బ్యాంకుకి ఎందుకొచ్చారో నాకు తెలిసిపోయింది' అన్నాడు.

'అందులో అంత రహస్యం ఏదీ లేదు లెండి' అన్నాన్నేను.

'మీరు ఆ వికలాంగుడిని తోసుకుంటూ వచ్చారని మా అటెండర్ చెప్పాడు.'

'ఏదో చిన్న సాయం...'

'ఒక విషయం అడుగుతాను. నిజం చెబుతారా?'

'అడగండి'

'అతను ఓ బిచ్చగాడని మీకు తెలిస్తే మీరతనికి సాయం చేసేవారా?'

'ఒక్క క్షణం పాటు నేను నిర్ఘాంతపోయాను. అతని రూపం గుర్తొచ్చింది. చక్కని బట్టలే వేసుకుని ఉన్నాడు. బిచ్చగాడిలా లేదు.'

'అతను బిచ్చగాడని మీకెలా తెలుసు?' రాఘవని అడిగాను.



'మా అటెండర్ చెప్పాడు. రెండు మూడు నెలలకి ఒకసారి వచ్చి చిల్లరిచ్చి పెద్ద నోట్లు తీసుకు వెడతాడట' చెప్పాడు రాఘవ.

'నేను అతడు వికలాంగుడని మాత్రమే సాయం చేశాను. అతనేం చేస్తాడనేది పట్టించుకోలేదు. అతను బిచ్చగాడని తెలిసినా సాయం చేసేవాడినేమో. పైగా నేను సాయం చేసింది స్వయనా 'దేవుడి'కిఅంటూ నవ్వేశాను.

నా సమాధానంలో చివరి ముక్క రాఘవకి అర్థం కాలేదులా ఉంది. ఆ మాటా ఈ మాటా చెప్పి నా దగ్గర సెలవు తీసుకున్నాడు.

రాత్రి పడుకునే ముందు, రాఘవ అడిగిన ప్రశ్ననే మా ఆవిడ అడిగింది.

'కొద్దిగా సంశయించినా తప్పకుండా చేసుండేవాడిని' అన్నాను.

బదులుగా మా ఆవిడ తనలో తాను నవ్వుకుంది. కారణమడిగాను.

'మనిషికి సాయం చేసి దేవుడికి సాయం చేశానంటూ రాఘవగారికి చెప్పడం గుర్తొచ్చింది. మానవ సేవే మాధవసేవ అంటారు కదా. ఆ సూక్తిని మీరు భలే వాడుకున్నారు. అందుకే నవ్వొచ్చింది.'

'నేను ఆ ఉద్దేశంతో ఆ మాట అనలేదు. నేను సాయం చేసిన అతని పేరు 'దేవుడు'. అంతే!' అంటూ నిద్రకి ఉపక్రమించాను.

రచయిత సెల్ : 9948464365

# అసలు నేనెవరు?

- కాళీపట్నం సీతా వసంత లక్ష్మి
సెల్: + 919810435949



ఇరువురు ప్రేమగా కలిసిన సమయం
నాకు ప్రాణం పోసిన సమయం
తలా తోకతో పెరిగాను
నొప్పి, హాయి తేడా తెలుసుకున్నాను
అప్పుడే వెళ్ళాము ఆసుపత్రికి
అమ్మ పొట్టపై ఏదో చల్లగా
బావుందనిపించేలోగా
ఏదో సరసరా ప్రాకింది
అమ్మ అటూ ఇటూ కొంచెం కదిలింది
ఎవరిదో మాట వినిపించింది
ఆడపిల్లలా అనిపిస్తోంది
అర్థం అయ్యేలోగా గంభీరమైన గొంతు పలికింది
అమ్మాయి అయితే మనకొద్దు
అబ్బాయి అయితేనే ముద్దు
నేను ఆడపిల్లనా?
ఆడపిల్ల అంటే ఏమిటి?
ఇది నా సంశయం
పెంచి పెద్దచేయాలి, చదువూ చదివించాలి
ఇన్నీ చేసి బోలెడు కట్నం ఇచ్చి పెళ్ళి చేయాలి
మన తరం కాదు
మళ్ళీ గంభీరంగా వినిపించింది
అమ్మ పొట్టలో నాకు తగిలాయి
అమ్మ వెక్కిళ్ళ తరంగాలు
అన్నీ అర్థం అయ్యేలోగా
నేనే లేకుండా పోయాను
పుడతానని నేనడిగానా?
నేను ఎందుకు ప్రాణం పోసుకున్నాను?
నేను ఎందుకు ప్రాణం పోగొట్టుకున్నాను?
అసలు నేను ఎవరు?
బైటి నుంచి వినిపించిన శబ్దాలు
నా చిరు ప్రాణానికి ఆటంకాలు!
అన్నీ తెలిసేలోగా
అదృశ్యం అయిపోయాను
ఆసుపత్రి చెత్తబుట్టలోకి చేరుకున్నాను
ఆడపిల్ల అంటే ఏమిటి?
మగపిల్లవాడు అంటే ఏమిటి?
ఆడపిల్లంటే అమ్మా నాన్నలకు చేదా?
మగపిల్లవాడు వారికి ఇస్తాడా ఆదా?
అసలు నేనెవరు? నా ప్రాణానికి విలువెందుకు లేదు?

---



# సమయం లేదు

హిందీ మూలం : అజ్ఞాత కవి
అనువాదం : డా॥ వెన్నా వల్లభరావు

సౌఖ్యాలన్నీ వచ్చి వాలాయి ప్రజల ముంగిట్లో
కానీ, సమయం లేదు వాళ్ళకి ఒక్కసారి నవ్వటానికి!
రాత్రనకా – పగలనకా పరుగెడుతున్న లోకంలో
జీవించడానికి కొంచెం కూడా సమయం లేదు!
అమ్మ జోలపాట అనుభూతైతే ఉంది
కానీ, అమ్మని 'అమ్మా!' అని పిలిచే సమయం లేదు!
సంబంధాలన్నింటినీ చంపేసి పారేశాం
కానీ, వాటిని పాతరెయ్యటానికి సమయం లేదు!
పేర్లన్నీ మొబైల్లో నిక్షిప్తమై ఉన్నాయి
కానీ, స్నేహం చేయడానికి సమయం లేదు!
పరాయివాళ్ళ విషయం చెప్పేదేముంది
అయిన వాళ్ళకోసమే సమయం లేనప్పుడు!
కళ్ళల్లో అయితే నిద్ర కావలసినంత ఉంది
కానీ, నిద్రించడానికి మాత్రం సమయం లేదు!
హృదయం బాధలతో నిండి ఉంది
కానీ, ఏడుద్దామంటే సమయం లేదు!
ఫ్యాషన్ లోకంలో పరుగులు పెడుతూ
అలసిపోవడానికి కూడా సమయం లేదు!
సాటివారి భావాల్ని గురించి పట్టించుకునేదేముంది
తమ కలలకే తమకి సమయం లేదు!
ఓ జీవితమా!
నువ్వే చెప్పు – ఈ జీవితమేమైపోతుంది?
"అనుక్షణం మరణించేవారికి
జీవించడానికి సమయం లేదు...!"

# 'నడక' నేర్పిన కవిత్వం



- డాక్టర్ రాధేయ

**మనిషిని మానవీకరించడంలో, వ్యక్తుల్ని సమూహం చేయడంలో సమూహాల్ని చైతన్యవంతం చేయడంలో కవిత్వానిది ప్రథమ స్థానం. జీవనదిలో నాటు పడవలా కవిత్వం ఓ భరోసా, ఓ ఓదార్పు!!**

**- సార్త్రే**

సమాజం పట్ల బాధ్యత, మనిషి పట్ల ప్రేమతో భవిష్యత్ ప్రపంచాన్ని దిద్దుకోవడమే కవిత్వ లక్షణం. ఏ కవికైనా సరే, అతని చుట్టూ ఒక సమాజం, ఆ సమాజానికొక చరిత్రా, ఆ చరిత్రకొక పరిణామం ఉంటాయి. సామాజిక చారిత్రక పరిణామ గమనంలో కవి యొక్క సాహిత్య స్థానం నిర్ణీతమవుతుందని శ్రీశ్రీయే స్వయంగా చెప్పుకున్నాడు.

రచయితకు సామాజిక స్పృహతో పాటు, చారిత్రక స్పృహ కూడా అనివార్యమని అంగీకరించాలి. అంతేకాదు వ్యక్తులలో సమాజంలో జరిగే మార్పులను యధాతథంగా, పాఠకులను హత్తుకునేలా రాయడం వర్తమాన రచయితల కర్తవ్యం. స్వసుఖం కోసం బతకడం, తన స్వార్థంకోసమే జీవించడం బలహీనతలతో, బాధ్యతారహితంగా జీవించడం, నైతిక విలువలకు తిలోదకాలివ్వడం వర్తమాన సమాజం యొక్క నిజస్వరూపం. ఈ స్వరూపాల్ని బద్దలు కొట్టి, మానవీయ గుణాలతో సామాజిక అసమానతలను అధిక్షేపిస్తూ మనిషిని మనిషి ప్రేమించాలని చాటిచెప్పేదే కవిత్వం, కవితత్వం.

సాహిత్యంలో ప్రక్రియ ఏదైనా కావచ్చు. అది సామాన్య పాఠకుని హృదయానికి హత్తుకొని సహృదయ పాఠకులు దాని గురించి ఉన్నతంగా చర్చించుకోవాలి.

నడత మనిషి వ్యక్తిత్వాన్ని ప్రకటిస్తుంది. నడక మనిషి ఆరోగ్యాన్ని మెరుగుపరుస్తుంది. నడక మనిషి లక్ష్యాన్ని, గమ్యాన్ని నిర్దేశిస్తుంది. నడక కవుల కెంతో ఆహ్లాదాన్ని కల్గిస్తుంది. వారి ఊహాజగత్తును అనంత దృశ్యాలతో అలంకరిస్తుంది. సృజనాత్మక శక్తికి పదును పెడుతుంది. ఈ 'నడక'ను తమ కవిత్వానికి ఆలంబనగా చేసుకున్న కవుల్ని వారి కవితల్ని విశ్లేషించుకుందాం!

నాలుగ్గంటలు కాకముందే కూతవేసి చెవులు పట్టి నిలేస్తుంది గడియారం. ఫైన్ మార్నింగ్ వాక్ కోసం కాలు బయటపెట్టగానే ఉల్లిపొర కాగితంలో చుట్టిన పొగమంచులా నగరం మెరుస్తూ కనువిందు చేస్తుంది అంటున్న ఈ కవయిత్రి -

"ఫైన్ మార్నింగ్ కాలు బయటపెట్టగానే / కానిస్టేబుల్ కాళ్ళకు చుట్టుకునే / రౌడీషీటర్లా గజగజలాడే రోడ్డు / రాత్రి పాల కాఫీ టీలతో నోరు / పుక్కిలించే కాకా హోటళ్ళు / వార్తలతో కడుపుబ్బే భూగోళాన్ని / సైకిల్ వెనుక కట్టుకున్న పేపర్ కుర్రాళ్ళు / ఊరి కంటే ముందు లేచి / ఊ కొట్టడం నేర్చుకునే మూణ్ణెల్ల పిల్లలు / నాగరికత వంతెన మీదుగా / నగరం వైపు ప్రవహించే పాలూ పళ్ళూ / పొగమంచు ఉల్లిపొర కాగితంలో చుట్టిన / సజీవ బహుమతి పట్టణాన్ని కళ్ళ కద్దుకుంటే / మనసులోని ఆర్ద్రతంతా తనువున చెమర్చి / తొలి ప్రేమ తొణికిన నాటి వింత మత్తు"

**- పాటిబండ్ల రజని**

ఈ కవికి నడిచే పాదాలంటే ఎంతో ఇష్టం. ఒకోసారి నడిచే రెండు పాదాలు ఒక చక్రాన్ని రెండు ప్రక్కల్నించీ తొక్కుతుంటే మొత్తం మూడు చక్రాలు కదులుతున్న దృశ్యమంటే ఇంకా ఇష్టం అంటున్న ఈ కవి -

"నడిచే పాదాలంటే ఇష్టం / రెండు చక్రాల సైకిల్ తొక్కడం చూసినా ఇష్టమే / రెండు చక్రాల బండినో మూడు చక్రాల బండినో / ఒకటో రెండో నాలుగు పాదాల పశువులు లాగడం / దాన్నొక రెండు పాదాల మనిషి తోలడం కూడా ఇష్టమే / ఒకటికి నాలుగుసార్లు / నా రెండు పాదాల కేసి చూసుకున్నాను / సజీవ కండరాల్తో గుండెల్తో కదిలే పాదాలన్నా / ఆ పాదాల మీద నడిచే మనుషులన్నా / నాకు వారి మీద / ప్రేమా గౌరవమూ ముమ్మరిస్తున్నాయి.

**- మానేపల్లి**

నేను నడుస్తుంటాను. భూమిని భుజాలపై మోస్తూ పుడమి తల్లి రుణం తీర్చుకొంటుంటాను. పల్లె పట్నానికి ఉగ్గుపాలు పోయడం, తాగిన రొమ్మును తనయుడు గుద్దడం నిరక్షరాస్యుడు అక్షరాస్యుడి ముందు సంస్కార పాఠాలు నేర్పిస్తుంటే నేను నడుస్తుంటాను అంటున్న ఈ కవి -

"గ్రీష్మంలో ద్రవీభవించి / శీతలంలో ఘనీభవించే / కోసిన గుండెల మధ్యన / నేను నడుస్తుంటాను / పాతేసిన ఆశలు పాదాలకు తగిలి / విలపిస్తాయి / దారిద్ర్యం సముద్రమయ్యాక / నడవడానికి దారెక్కడిది? అయినా నేను నడుస్తుంటాను"

**- అడిగోపుల వెంకటరత్నమ్**

నడకంటే గమ్యం కాదు త్యాగం. నా దేశం చాలా నడకల్ని చూసింది. చివరి రక్తపు బొట్టును బొటనవేలిపై ఒలికించిన వారిని చూచింది. దేశం రెండు కనులను చేతితో విడదీసి ఎండిన జీవనదులను చూసింది. ఈ దేశం ప్రజలకు త్యాగం విలువ తెలుసు అంటున్న ఈ కవి -

"ఇక్కడ / ఎక్కడ నుండి / ఎక్కడకయినా, నడిచిపోవచ్చు / నడవడానికి కాళ్ళే అక్కర్లేదు / ఎట్లయినా ఎలా అయినా నడిచిపోవచ్చు / గమ్యం చేరాక / రెండు కాళ్ళను బంగారు పళ్ళెంలో సేదదీర్చవచ్చు / కొంతదూరం నడిచాక / ఇక నడిచింది చాలని అనుకోవచ్చు / ఆకలితో నిద్రిస్తున్న మంచం / నడవడం అనివార్యం / ఈ దేశ ప్రజలకి / ప్రాణ త్యాగం విలువ తెలుసు / ప్రాణత్యాగం కంటే ముందర / మంచి నడకకు / కాళ్ళను సిద్ధం చేస్కోండి/"

**- అరసవిల్లి కృష్ణ**

నా నడకలో అలిసిన దేహం చెమట కన్నీరు కారుస్తోంది. అయినా లెక్కచెయ్యను నడుస్తూనే ఉన్నానంటున్నాడు ఈ కవి -

"శృతి మించిన రాగంలా / అదుపు తప్పి ప్రవహించే రక్తానికి / స, రి, గ, మ, పదనిలా సరిగ పదమని / సంకేతమిస్తోంది నా నడక / రక్తప్రసార మందని తిమ్మిర్ల నిరసనను / నిర్భయంగా ప్రకటిస్తూ / నా కాలినడకకు కైమోడ్పు చేస్తున్నాయ్ / నడక నా ఆరోగ్యానికి వైద్యం / నా మనోవికాసానికి లేపనం /

**- ఇంద్రగంటి మధుసూదనరావు**

నిరుద్యోగి నడిచిపోతున్నాడు. ఉద్యోగి నడిచి పోతున్నాడు. కవి నడచి పోతున్నాడు. నాటక రచయిత, నర్తకి నడచిపోతున్నారు. వీరందరికీ ఆశలు, కలలు, ఊహలు ఉన్నాయంటున్నాడు కవి -

"నిరుద్యోగి నడిచిపోతున్నాడు / ఉద్యోగాల వైపు ఆశగా చూస్తూ / ఉద్యోగి నడిచిపోతున్నాడు / సొంత ఇంటి కోసం పగటి కలలు కంటూ / కవి నడచి పోతున్నాడు / పరధ్యానంగా ఊహాలోకంలోకి / నాటక రచయిత / సినిమా రంగంలోకి / నర్తకి తారాపథం వైపు / నడిచిపోతున్నారు / "

**- ఎ. సూర్యప్రకాశ్**

ప్రతి రోజూ దేహ వాహ్యాళికెళ్ళాలి. అలా సాయంకాలం పూట కాలువ గట్టుకో, తోటలోకో షికారుకెళ్ళాలి. అంటున్న కవి -

"అలా / సాయంకాలం పూట / కాలువగట్టుకో తోటలోకో / షికారుకు వెళ్ళినట్టు / అప్పుడప్పుడూ / దేహంలోకి వాహ్యాళికెళ్ళాలి / మాగిన నేల పనసపండు / సుగంధ పరిమళమూ / వెంటాడుతుండగా / దేహమాళిగలో ఉన్మాదిలా తిరగాలి / పాంచభౌతిక దేహారణ్యంలో / కనీ కనపడక కదలాడే కస్తూరి మృగాన్ని / మాటు వేసి ఒడిసి పట్టుకోవాలి/"

**- శిఖామణి**

నడవడమంటే నీ మూలాన్ని నువ్వు తెలుసుకోవడం, నీ బలాన్ని నీవు గుర్తించడం, నీ మట్టిని నీవు నమ్ముకోవడం, నువ్వు అడుగు తీసి అడుగేసినప్పుడు ఈ చైతన్యం, ఈ గమనం నీదే. నడుస్తుంటే కలలు దూరంగా తొలగిపోతాయి. భ్రమలు దూదిపింజల్లా చెదిరి పోతాయి. అబద్ధాలు నీటి బుడగల్లా పేలిపోతాయి అంటున్న ఈ కవి-

"నడవడం అంటే / నీ మూలాన్ని నువ్వు తెలుసుకోవడం / నడవడం అంటే / నీ తోటి వారితో నువ్వు కలగలసిపోవడం / సామాన్యుల్లో నువ్వు ఒకడివిగా కరిగిపోవడం / నువ్వు భుజంభుజం కలిపి కదిలినప్పుడు / ఈ విశ్వాసం నీది, ఈ సంతోషం నీది / ఈ రోడ్ల పక్క, ఈ ఫుట్‌పాత్‌ల మీద / ఈ మురికి కూపాల్లో, ఈ జనం గుంపుల్లో / కుప్పతిప్పలుగా దొరికేవి / ఇలా నడుస్తూ నడుస్తూ పోతున్నప్పుడే / ఈ రోడ్ల మీద కాళ్ళాడించుకుంటూ / చెప్పులరగ దీసుకుంటూ / నడుస్తూనే వుంటాను / అనేకానేక దృశ్యాల్ని ఏరుకుంటూ/"

**- శీలా వీర్రాజు**

నడక నా సంస్కృతి. మెట్ల మీంచి ఎక్కుతూ వాటి మీద నడిసొచ్చిన జ్ఞాపకాల్ని ప్రేమగా దాచుకుంటాను. వీధి మలుపులో మండుటెండలో ఇస్త్రీ పెట్టెతో కుస్తీ పడుతున్న మామూలు మనిషిలో నన్ను నేను చూసుకుంటాను అంటున్న ఈ కవి -

"నడక నా సంస్కృతి / తోటి మనిషిలోకి / లోలోపలికి నడవడం / నా సంస్కృతి / నేల మీద నడిచే / మామూలు మనుషుల్లోకి తొంగి చూస్తాను / అక్కడే తిరుగాడుతున్న / కాస్త పరిమళాన్ని కోసుకొని / నా జేబులో వేసుకుంటాను / ఇంకా నడవాలి / మనుషుల్ని తవ్వుకుంటూ నడవాలి / మనిషి గాయపడ్డ చోటల్లా / కాస్త మానవత్వాన్ని అద్దుకుంటూ నడవాలి / గ్లాసుడు చిరునవ్వుని చేతికందిస్తూ నడవాలి/"

**- డా॥ బండి సత్యనారాయణ**

ఈ కవి తన శ్రీమతితో కలిసి మార్నింగ్ వాక్ మొదలెట్టారు. వైద్యుని సలహా, నిత్యం చూసుకొంటున్న అద్దంలో ప్రతిబింబం, ఇరుగు పొరుగు వారి సూచనల్తో వీరి పొద్దుటి నడక మొదలైందని చెబుతున్నారు. ఇంట్లోంచీ వీలు చేసుకొని, రద్దీ రొదల రహదారుల్ని గబగబా దాటేసి యూనివర్శిటీ క్యాంపస్‌కు చేరుకుంటారు. ఓ కొత్త లోకపు శాంత ప్రశాంత తీరంలో అడుగిడినట్లుగా హాయిగా సేద దీరే దృశ్యాలను మనకు తెలియజేస్తున్నారు -

"పరిసరాల్ని స్వీకరిస్తూ మేం నడుస్తుంటాం / చటుక్కున కొత్త జంటొకటి / మమ్మల్ని దాటెళ్తుంది / ఉల్లాసపు పాటలా, ఉరకలెత్తే నదిలా / మా వెనకాల / తెల్లని కిరీటాల్తో వయసు మళ్ళిన వాళ్ళు / మెల్లగా పదిలంగా అడుగులో అడుగేస్తూ / వస్తుంటారు సడలిన దేహాల్తో / నడుస్తున్నవి పాదాలేనా, మా మాటలు కూడా / నడుస్తుంటామా, నడుమ నడుమ గడియారం హెచ్చరిస్తూ వుంటుంది / మాటలు కొన్ని నడకను నెమ్మది పరుస్తాయి / మరికొన్ని చురుకు ఇంధనాన్నిస్తాయి /



# మనోదహనం...

- సాయి పద్మ
సెల్ : 9052627070

వరుసలో చివరాఖరికి నా పేరు పిలిచేదాకా
తెలియలేదు... నాది చివర్లో పలికే కులమని...

కాపీ కొట్టావేమో... లంగా బొందు విప్పమన్నప్పుడు
తెలిసింది... మౌనంగా ఉంటే కుదరదని...

మాలదానికి మనసెందుకులే... మొగుడొస్తే చాలదా...
అన్నప్పుడు అర్థమైంది... ఇదో కొత్త అంటరానితనం అని...

నీతో పిల్లలొద్దులే... అయినా నీకు నేను నాకు నువ్వు...
అంటుంటే... అవగతమైంది...ప్రేమికులలో కులం ఉందని...

కోటాలో వచ్చింది... దీని మాట వినేదేంటిరా
సహోద్యోగి స్వగతం... ఆవిష్కరించింది నా గతం...!

"అది" "ఇది" అనటంలోనే బయటపడ్డ అహం...
అవసరమైతే అత్యాచారానికి వెరువదని... అర్థమైంది!

మూల ప్రవృత్తి మారనంతవరకు...
మంచితనం మాలతనమవుతుందని...
మనిషితనం నివ్వెరపోయినప్పుడే... అర్థమైంది...
మనసుతనం... మూగపోరాదని... మాట తీసుకుంది...!!

---

# నానీలు

- దామరకుంట శంకరయ్య
సెల్ : 9440876788



ఆసిడ్ దాడి
విలువలు శూన్యం
ఎన్‌కౌంటర్
ప్రజాస్వామ్యం మిధ్య

వీధి నాటకాలు
వీడియో కెక్కినై
కళాకారుల
కడుపులు మాడ్చినై

చదువు
ప్రతివాడికి అవసరం
అందుకే
వాణిజ్య సరుకయింది

పెన్ను నడిస్తే
సాహిత్యపు తోట
గన్ను నడిస్తే
కన్నీటి ఊట

దాహమేస్తుందా!
బావుల్లో నీళ్ళు లేవు
బజార్లోవి
కూల్‌డ్రింక్స్ తప్ప

రాజకీయ పార్టీ
మంచిదేదంటావు?
వేటాడే జంతువు
మంచిదేదంటేలా!?

---

మాటల్లేకపోతే మాత్రం నడక బరువెక్కుతుంది / నడిచొచ్చి చేరిన కొత్త అధ్యాయంతో / మా ఇంటి పుస్తకం ఇప్పుడు / ఒకింత ఆరోగ్య కాంతితో నాజూగ్గా మెరుస్తోంది / పొద్దుటి సూర్యుడిలా/ "

- దర్భశయనం శ్రీనివాసాచార్య

ప్రతి ఉదయపు నడకా ఒక మధుర గీతమేనంటున్నారు ఈ కవి. చీకటిని అడిగి బొగ్గును, వేకువను అడిగి సుద్దను తెచ్చి ఉషస్సు తన నలుపు తెలుపుల బొమ్మ గీస్తున్నప్పుడు హృదయ లయకి శృతి కలుపుతూ ఆలపిస్తాను నా చరణ యుగళ గమన గీతం –

"ఏ జన్మలో మొక్కలకిన్ని నీళ్ళు పోసేనో / మహావృక్షాలు తమ సహస్ర బాహువులు సాచి / నాకు స్వాగతం చెబుతాయి / ఎప్పుడైనా ఓ అల్లరి మేఘం నన్నాట పట్టించడానికి / నాలుగు చినుకులు చిలకరించబోతే / గొడుగులు పట్టడానికి పోటీ పడతాయి చెట్లు / నడిచి నడిచి చెమట పూల చెట్టునైన నన్ను / కాసేపు విశ్రమించమని రోడ్డు పక్క కానుగట్టు / తనను తాను శుభ్రం చేసుకొని / ప్రేమగా స్వాగతిస్తుంది / ప్రత్యూష పవనాల తీపి సంగతులతో ప్రకృతి / నా చెవిలో పలికే ప్రాణ రహస్యం / ప్రతి ఉదయపు నడకా ఒక మధుర గీతమే / మనసుకు శుభ్రస్నానమే/ "

- గంటేడ గౌరునాయుడు

'నడక' పురోగమనం. నడక అభివృద్ధి పథం. నడక సాగించేవాడు చైతన్య భావుకుడు. నడకతోనే నాగరికత వికసించింది. నడిచే పాదాలంటే మనుషులకు అత్యంత గౌరవం. లక్ష్య సాధన కోసం నడక సాగిస్తే గమ్యమెప్పుడూ చేరువగానే ఉంటుంది. నడక ఆరోగ్యానికి వైద్యం. మనోవికాసానికి లేపనం. నడక ఒక గొప్ప ఆత్మవిశ్వాసం. అంతకుమించిన మానవత్వపు పరిమళం. ఈ కవిత్వపు నడకను మనసారా అభినందిద్దాం రండి!!

రచయిత సెల్ : 9985171411

# తీరా తీరం పైకి చేరిన తర్వాత



- రామా చంద్రమౌళి
సెల్ : 9390109993

వర్తమానానికి ఒక కొస గతం.. మరో కొస భవిష్యత్తు
మధ్య ఒక లోలక డోలనం
అటు లోయ... ఇటు శిఖరం... బహుముఖీన యాత్రోన్మత్తత
వచ్చీ వచ్చీ వీధిమలుపుపై నిలబడి
ఒక పాటను, ఒక దృశ్యాన్ని,
ఒక వర్ణ ముద్రను గుండె సంచీలో వేసుకుని
అలా జీవితంలోకి వెళ్ళిపోవడం... అంతే
కళ్ళు మూసుకుంటావు... శరీరాన్ని నేలపై పరిచి
ఒంటరివి... ఒక్కడివే
తోడుగా అప్పుడప్పుడు... ఎవరో వచ్చి..
కొద్దిసేపుండి... మళ్ళీ మాయమై
ఆ కొస స్ఫురిస్తుంది
అప్పటి నీ అందం, నీ శరీర సౌందర్యం, నీ వసంతోగ్రహేల
ఒళ్ళంతా ఒకటే విద్యుత్ ప్రకంపనలు
నదిని శరీరం చుట్టూ చుట్టుకుని... గగనాంతరాల్లోకి నిర్గమనం
దేన్నయినా జయించగలననే ఉన్మత్త మాధుర్యం
ఇప్పుడిక... క్షితిజరేఖపై నుండి నడచి నడచి వచ్చి
ఒక అస్తమయ గవాక్షం దగ్గర... ఈ కొస
అదే వజ్రదేహం... రాలుతున్న ఆకై... అలసిన పాదాలై
ఏదో అనుభవమై... ఏదో అర్థమై, ఇంకేదో అర్థంకాక
రాలిన ఆకుల కుప్పలో నుండి
పాము జరజరా జారిపోయిన చప్పుడు
ఒక జలదరింపు... ఒక తొంగిచూపు... ఒక అనిత్యత స్పృహ
ఇన్నాళ్ళూ అపరిచితమైన సకలం
ఇప్పుడు అంతా పరిచయమే ఐనట్టు బింబప్రవేశం
ఒంటరిగా రా... సంయుక్తమై నడువు... ఒంటరిగానే వెళ్ళిపో
ఎంట్రీ అండ్ ఎగ్జిట్
అంతా స్పష్టమే...
మొన్నటి మోడు నిన్న చిగురించింది కదా...
రేపు మళ్ళీ మోడవుతుంది
ఎండి నిండి... ప్రవహించి... మళ్ళీ ఎండి... మళ్ళీ నిండి
అంతా నాద, అనునాద, ప్రతినాదాల విస్తరణ
నిశ్శబ్దమెప్పుడూ 'శుద్ధ' నాదం
శబ్దం విద్యుత్, ప్రవహిస్తూంటూంది అతిక్రమిస్తూ
స్ట్రెచ్ ద ఇన్నర్ అండ్ ఔటర్... లోయర్ అండ్ అప్పర్
అంతా మగత... మత్తు... తిమ్మిరి... రిమ్మ
ప్రేమ మత్తు, మోహం రిమ్మ, ధనం నిషా... సెక్స్ పిచ్చి
మెట్లు మెట్లుగా దారి... చుట్టూ... అంతటా
ఎక్కుతూ క్రిందికి రావటం
దిగుతూ పైకి చేరడం... విలోమానులోమం
తీరా తీరంపైకి ప్రాకివచ్చి నిట్టనిలువుగా నిలబడ్తే
ఎదురుగా... అర్థంకాని ఒక విశాల సముద్రం... అంతే..

---

# నానోలు

- పెరుగు రామకృష్ణ
సెల్ : 9849230443



కిరణాలు
ప్రవిస్తూ
ఉదయం
పరుగు

వృద్ధాప్యం
ముడతలు
అనుభవాల
మడతలు..

నీళ్ళు
ముంచెత్తాక
మిగిలేది
కన్నీళ్ళే

అన్నీ
ప్లాస్టిక్
ముఖాలే...
నగరంలో

లక్ష్యం
చేరాక
అన్నీ
విలక్షణమే

---

# బంజారా నానీలు

- డా॥ సూర్యా ధనంజయ్
సెల్ : 9849104187

ఎప్పుడో
ఏదో కోల్పోయిన బాధ
తర్వాత అర్థమయింది
నా తండా అస్తిత్వం



ప్రపంచీకరణం
దేన్నీ వదలల్లేదు
ఆఖరికి
బంజారా సంస్కృతిని కూడా

తండాల్లో
జొన్నబాటి మాయం
ఫాస్ట్‌ఫుడ్ సెంటర్లలో
వెతకండి
(బాటి = రొట్టె)

పుట్టుకతోనే
మట్టిమనిషి
అందుకే అతని మాటలు
పచ్చ పచ్చన

వారసత్వం దర్జా
పృధ్వీరాజ్ చౌహాన్‌దే
పేదరికం ముందు
అది బలాదూర్

# ఊరుమ్మడి బతుకుల కథలు



- ఆచార్య మూలె విజయలక్ష్మి

**జోగిని చేయడంలో గ్రామ పెద్దలు ప్రమేయం ఉంటుంది. జోగినిని చేయాలనుకున్న అమ్మయికి గ్రామ దేవతతో వివాహం జరిపించడం జోగుపట్టం. గ్రామదేవతకు బదులుగా పోతురాజు తాళికడతాడు. జోగినుల్లో వృద్ధురాలు కూడా మంగళ సూత్రం కట్టవచ్చు. మాతంగి కయితే అమ్మాయి మేనమామ, పెద్దమాదిగ, లేదా పెద్దగొల్ల మంగళ సూత్రధారణ చేస్తారు.**

పేరు ఏదైతేనేం! ప్రాంతం ఏదైతేనేం! వ్యవస్థ ఏదైతేనేం! మహిళలు బసివి, జోగిని, మాతమ్మ పేర్లతో పురుషుని భోగలాలసతకు, మూఢాచారాలకు, మూఢనమ్మకాలకు బలవుతున్నారు. గ్రామాల్లోకరువు కాటకాలు ఏర్పడినా, రోగం రొష్టు వచ్చినా, మగ బిడ్డలు పుట్టకపోయినా గ్రామదేవతకు ఆడపిల్లను అర్పించే ఆచారం అనాదిగా కొనసాగుతోంది. ఆరునెలల పసికందు నుండి పదహారేండ్లలోపే ఈ కూపంలోకి నెట్టబడుతున్నారు. ఎల్లమ్మ, పోచమ్మ, మైసమ్మ, మాతమ్మ, మరియమ్మ, ఉలగమ్మ, సుంకాలమ్మ దేవతలకు దళిత వెనుకబడిన వర్గాల్లో ఆడపిల్లలను అర్పిస్తున్నారు. దేవతకు అర్పించిన బిడ్డ సుమంగళిగా పరిగణింప బడుతుంది. తెలంగాణాలో జోగినులు శవ యాత్రలో నృత్యం చేస్తారు.

జోగిని చేయడంలో గ్రామ పెద్దలు ప్రమేయం ఉంటుంది. జోగినిని చేయాలనుకున్న అమ్మయికి గ్రామ దేవతతో వివాహం జరిపించడం జోగుపట్టం. గ్రామదేవతకు బదులుగా పోతురాజు తాళికడతాడు. జోగినుల్లో వృద్ధురాలు కూడా మంగళ సూత్రం కట్టవచ్చు. మాతంగి కయితే అమ్మాయి మేనమామ, పెద్దమాదిగ, లేదా పెద్దగొల్ల మంగళ సూత్రధారణ చేస్తారు.

మరో కార్యక్రమం మైలపట్టం. జోగిని జోగుపట్టంలో ఖర్చు భరించిన వ్యక్తి మైలపట్టంనిర్వహిస్తాడు. సాధారణంగా భూస్వాములు, పెత్తందార్లు. అమ్మాయి రజస్వల అయిన తర్వాత మంచిరోజు చూసి అతనితో సమాగమం ఏర్పాటు చేస్తారు. తర్వాత అతనితో ఉండవచ్చు. ఆ రాత్రికే పరిమితమై ఊరుమ్మడి బతుకు కావచ్చు. జోగిని, మాతంగి వంటి దురాచారాలను రూపుమాపడానికి ప్రభుత్వం, స్వచ్ఛంద సంస్థలు కృషి చేస్తున్నా ఇంకా కొనసాగుతున్నాయి. ఈ ఆచారం అమానవీయం, అసాంఘికం, నాగరిక సమాజానికి సిగ్గుచేటు.

తెలుగు కథా సాహిత్యాన్ని అవలోకిస్తే సమాజంలోని ఈ దురాచారాన్ని ఎత్తిచూపించిన కథలు పురిసెడు కూడా లభించవు. నాగప్పగారి సుందరరాజు 'నడిమింటి బోడెక్క బసివిరాలయ్యెద' (1997) ఐతా చంద్రయ్య 'కలికి గాంధారి' (2001), గోగుశ్యామల 'రడం' (2004), డా॥ ముత్యం వెంకన్న 'దరిలేని బావులు' (2006) జోగిని సమస్యపై దృష్టి పెట్టిన కథలు.

దళితుల్లో ఈ ఆచారం కొనసాగింపులో పెత్తందార్లు ఒకవైపు, దళితుల, వెనుక బడిన వర్గాల అజ్ఞానం, ముఢనమ్మకాలు మరోవైపు పసికందుల జీవితాలను నలిపి వత్తలను చేస్తున్నాయి.

తరతరాలుగా సాగుతున్న జోగిని దురాచారానికి తన బిడ్డ జీవితం బలి కాకూడదని, హత్య చేసి, జైలు పాలయిన ఒక తల్లి గాథ కలికి గాంధారి. ఇది తరతరాలుగ జరుగుతున్న తంతు. ఆ ఆడబిడ్డకు దేవున్తో పెండ్లి, ఆనాటి నుండి ఊరుమ్మడి బతుకు. బలమున్న వానిది పైచేయి. గాంధారి తల్లిది అదే పరిస్థితి. ఆ ఊరి జమిందారు రంగారావుదే ఆమెపై పెత్తనం. వారికి కల్గిన బిడ్డ గాంధారిని బడికి పంపించారు అమ్మ, అమ్మమ్మ, అందుకు దొరచేతిలో చావుదెబ్బలు తిని కన్ను మూసింది అమ్మమ్మ. రంగారావు గతించాడు. పధ్నాలుగేండ్లకు గాంధారికి పెండ్లి జరిగింది దేవున్తో. జమిందారు కొడుకు ఎల్లారావు తయారయ్యాడు. వావి వరుసలు చెప్పినా చెవి కెక్కించుకోలేదు. గాంధారికి బిడ్డ కలిగింది. పిల్లపేరు మేనక. మేనక పట్నంలో చదివింది. టీచర్ రఘురాం ఆమెను ప్రేమించాడు. పెళ్ళి చేసుకుంటానన్నాడు. ఇంటికొచ్చిన మేనకను ఒకరోజు ఎల్లారావు కొడుకు కమలాకర్రావ్ బలాత్కరించబోయాడు. గాంధారి కాళికయింది. కమలాకర్రావ్ గాంధారి చేతిలో హతుడయ్యాడు. ఫలితంగా గాంధారి జైలుపాలయింది. మేనక రఘురాంలు పెళ్ళి చేసుకున్నారు. వారికొక కొడుకు. గాంధారికి శిక్ష ముగిసి విడుదలయ్యే రోజుకు అదే జైలుకు సూపర్నెంటు ఎల్లారావు. భార్య చనిపోయిందని, గాంధారి సమ్మతిస్తే భార్యగా స్వీకరిస్తానని ప్రాధేయ పడతాడు. "ఇయ్యాల భార్య వంటావు, రేపు జోలు పట్టుకునే జోగినివంటావు." "ఇంకా మనం పశువులోలే ఉండొద్దు. చూడు దొరా! భారతంల గాంధారి కండ్లున్నా గుడ్డిదై కొడుకుల్ని చంపుకుంది. కాని.......... కాని నేను కలియుగము

లుంటున్నా.... కలికి గాంధారిని..... నీ కొడుకు చావంగనే నీ వంశం ఖతమైంది. కాని నా మనుమనితో నా వంశం శురువైంది. తెల్సుకో! "నీ తొవ్వనీది, నాతొవ్వనాది" ఖాండ్రించి ఉమ్మి గాంధారి గిరుక్కున వెనుదిరిగింది.

కన్నబిడ్డను జోగిని చేయడానికి ఇష్టపడక, బిడ్డకు చదువే ముఖ్యమనుకొని ఆస్తిపాస్తులను వదులుకొని ఊరొదిలిన దంపతుల గాథ 'రడం'.

చంద్రయ్య దళితుడు. ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. ఆడబిడ్డను చదివించాలనుకున్నాడు కాని ఆ ఆడబిడ్డను జోగిని చేయాలని పెద్దకులపు పటేళ్లు పట్టుపట్టారు. అంతకు ముందున్న జోగిని వృద్ధాప్యం వల్ల రంగమెక్కి కొలుపు చెప్పలేకపోతోంది. ఆమె వుండగానే పద్ధతులన్నీ చెప్పించాలని చదువు ఆపెయమన్నారు.

"రేపటి ఊరడమ్మ పండగకు రంగమెవ్వరెక్కుతరు? పోలెపల్లిలో 'సిడి' ఎవరు కడ్తరు? మనూర్ల జోగుకిడిసిన లస్మి (లచ్చి) ముసల్దయింది. దానికి కొలుపు జెప్ప నుదుగులు డొల్లకొచ్చినయి. ఊర్ల శానామందికి అమ్మవారు పోసినపుడు ఊరడమ్మకు జీవులను, దున్నపోతులను కోసి పెద్ద పచ్చి తునకను, జోగిని నోట్ల వేలాడదీసి ఊరుసుట్టు దీపాలంటే ఏడ వషవడ్డది. ఈ ముసల్దాని కాల్లు సుట్టకపోయి వరిబందాలల్ల సుట్టుకోని దిమ్మరపోయిపడ్డది. రంగమెక్కడానికి ముందు దినం నుండే ఉపవాసముండి, ఊరడమ్మకాడ కుండ మీదెక్కి నిలవడి రంగమెక్కి కొలుపు చెప్పాలంటే అట్లట్లనే ఆయె. ఇంగ 'శిడ' ఎక్కాలంటే దీనితరమయితదా? యాడయితది. పడుసు పోరీలె ఆగం గాపట్టిరి. ఇదంత గాదురా ఇంకో పిల్లను జోగుకిడ్వాలె" అన్నారు.

చంద్రయ్య దళితుడు. ఇద్దరు కొడుకులు, ఒక కూతురు. ఆడబిడ్డను చదివించాలనుకున్నాడు కాని ఆ ఆడబిడ్డను జోగిని చేయాలని పెద్దకులపు పటేళ్లు పట్టుపట్టారు. అంతకు ముందున్న జోగిని వృద్ధాప్యం వల్ల రంగమెక్కి కొలుపు చెప్పలేకపోతోంది. ఆమె వుండగానే పద్ధతులన్నీ చెప్పించాలని చదువు ఆపెయమన్నారు.

అయినా చలించలేదు చంద్రయ్య. రాత్రికి రాత్రే పట్నంలో హాస్టలులో చేర్చాడు. ఈ సంగతి తెలిసి మండిపడ్డారు పెద్దలు. చచ్చేంత దెబ్బలు కొట్టారు. పెద్దలందరు చేరి జోగిని కిడ్వకపోతే ఊరు విడిచి పెట్టాలని నిర్ణయించారు. అంతేకాదు రెండెకరాల భూమి మీద పటేలు కన్ను పడింది. బిడ్డను జోగినికి విడవాలి లేదంటే భూమిని వదులుకోవాలి. చంద్రయ్యది పంగల నడుమ మేడికాయ పరిస్థితి.

రెక్కలు గట్టిగ ఉన్నన్నాళ్లు కూలీనాలీ చేసుకొని బిడ్డను చదివించాలని నిర్ణయించుకున్నారు. మడి, మట్టి యిల్లు వదిలి కట్టుబట్టలతో పట్నం బాట పట్టినారు. గూడులేని పిట్టలయినారు. "జోగినిని కానన్నందుకు భూమిని వదులుకున్న నా బాల్యం మా యింటికి, కులానికి, నాకు రడమై నేటికీ సల్పుతుంటది." రడమంటే వ్రణం.

బసివిరాలుగా మార్చే తతంగాన్ని నడిమింటి బోడెక్క బసివిరాలయ్యెద కథలో నాగప్పగారి సుందర్‌రాజు పూసగుచ్చినట్టు వివరించారు. వూరి రైతుల ఒత్తిడి, ఆజ్ఞపై మాదిగ కందారప్ప పదేళ్ళ బిడ్డను బసివిరాలుగా వదిలేందుకు సమ్మతించారు. బసివిరాలు చేయడానికి ఖర్చు రెండువేలు. పెద్ద రెడ్డి ఒక వెయ్యి, తక్కినది ఊరందరు కలిసి ఇవ్వడానికి ఒప్పుకున్నారు. అది అందరికి పండుగ. అమ్మ కార్యం బోడెక్కకు మాత్రం అంతులేని దుఃఖం. ముహూర్తం ఆరెద్దుల కార్తి అయిన మూడు దినాలకు. ఆ రోజు బోడెక్కకు గంగస్నానం చేయించారు. పాడుబావిలో దించి పాత బసివిరాళ్లు కడివెడు నీళ్ళు నెత్తినపోసి, ఇంటికాన్నించి కట్టుకొచ్చిన తెల్లచీర, తెల్ల రవిక తీసేసి, వేపాకు మండలతో ఒళ్ళంతా చుట్టారు. కాళ్ళకు, చేతులకు ముఖానికి బుక్కుపిండి పూసి, బొట్టుపెట్టి, జుట్టు విరబోసారు.

"అక్కుల్‌జోవ్.... జోక్కులోజోవ్ జోగోజోగో" అంటాని మూడుసార్లు "జోగులు తట్ట" పట్టుకుని బసివిరాళ్ళు అందరు జోగేసిడిసిరి. బోడెక్క తుక్కు తిరిగి మూడుసార్లు, పడమట తిక్కు మూడుసార్లు, తూర్పు తిక్కు మూడుసార్లు తిరిగి మొత్తుము తొమ్మిదిసార్లు జోగేసి... "దోవ్‌ఉదో... ఉదోవ్‌ఉదో..." అంటాని జోగులు తట్లు యడమ భుజంమింద పెట్టుకుని కుడిసేత్తో యపాకు మండ్లు పట్టుకుని బసివిరాళ్ళు అందరు క్యాకులేసిడిసే".

"తప్పట్లతో బసివిరాళ్ళు ఇతర ఆడోళ్ళు బోడెక్కను నడిపించుకొని వూరేగింపుగా సవురమ్మ గుడికి తెచ్చి అక్కడ మా వూర్లో వులిగెమ్మవ్వగుడి లేదు. అందుకనే సవురమ్మవ్వ గుడిలోనే వొగుమూలుకి జొండ్లు పోసి, జొండ్లు మింద మరువు పెట్టి మరువు మింద ముంతపెట్టి, ముంతమీద పీసుతీని ట్యంకాయి పెట్టి దానికి మూడు బండారుతో అడ్డబొట్లు పెట్టి దానిమింద పూలుదండ యేసి దేవుతిని" చేసారు.

టెంకాయ కొట్టి పూజచేసి దేవరపోతుని, బోడెక్కను గుడిచుట్టూ మూడుసార్లు తిప్పి, గుడి ముందు నిలబెట్టారు. దేవర పోతుని ఇరగబట్టుకుని ఒక దెబ్బతో తలారి రామిగిరి తల నరికేసాడు. తర్వాత బోడెక్కను గుళ్ళోకి తీసుకుని పోయి పూజచేసి, జోగుళ్లు యేసినారు. "పయ్యంత సుట్టిన యాపాకుమండ్లు ఇప్పి ఆదరాబాదరా పసుపు పచ్చచీర, రెయిక తొడిగిచ్చి ద్వావరుకట్ట ముందు నిలబెట్టిచ్చి కర్నుము సామితో కాలు తొక్కిచ్చి బయినే రామన్నతో దావుర్లు కట్టిపిచ్చిడిసి".

"బోడెక్క ఇంగా పెద్దమనిషి కూడా అయిలేదు కదమ్మా, ఈ పొద్దు బసివిరాలుని ఇడిసేరకదా. ఆ ద్యావుర్లు గట్టిన పూజారాయప్ప. కాలుదొక్కిన కర్నుము సామి, కుంకునుము గట్టిన గరువయ్య ముగ్గురు ముసలినాబట్లు కలిసి, సామి కార్యుమని ఆ పిల్లని ఈ రాతిరికే వొగుడయినంక వొగుడు పక్కులో పొందు బెట్టుకుంటారంట. అన్నిము పున్నిము యెరుగని నడిమింటి బోడెక్కని బసివిరాల్ని సేసి బజారికి యేసిడిసిరి" అంటూ వాపోయింది ఓ తల్లి.

జోగినులను సమాజం చులకనగా చూడటాన్ని నిరసించి, తమ బతుక్కు తమ బిడ్డల బతుక్కు భవిష్యత్తు బాగుండాలంటే ఆర్థికంగా నిలదొక్కుకోవాలనే స్పృహతో భూమి కోసం పోరాడిన జోగినుల కథ "దరిలేని బావులు"

నిజామాబాద్, అదిలాబాద్ జిల్లాలను కలుపుతూ రోడ్డు. రోడ్డుకు ఒకవైపు గ్రామం, మరోవైపు మాదిగోల్ల కాలనీ. అక్కడ రెండు వరుసల్లో పన్నెండు సర్కారు ఇళ్లు. అవి జోగోల్ల ఆవాసం. ముగ్గురు వెనుకబడిన కులాలు, ఇద్దరు చిందోళ్లు మిగతావాళ్లు మాదిగలు.

ఒక్కో మహిళదీ ఒక్కో గాథ. అన్ని గాథల సారాంశం ఒకటే. చిన్నక్కకు పదిహేనేళ్లకు దేవునితో పెళ్లయింది. "చిన్నమ్మకు దేవుడి దగ్గర పట్నాలు కట్టిరి (పండగ జేసిరి). పోతురాజుతోటి చిన్నక్కకు పెండ్లి చేసిరి. తండ్రి వయసున్న ఊరి "పెద్దమనిషి" లేపుకునె.

ఆ పెద్దమనిషితనం మారినప్పుడల్లా చేతులు మారింది చిన్నక్క దున్నపోతుల మధ్య దుడ్డె చందం అయింది బతుకు".

ఆమె కూతురు లత. జోగుబిడ్డకు చదువా! అని లోకం మాట్లాడినా చదువుకేసింది. పదకొండు చదువుతుండగా వెలమల అబ్బాయి రాజేశు పెళ్ళాడతానన్నాడు. అందరినీ సమ్మతింపజేసి కార్యం ముగించింది చిన్నక్క. ఏడాదికే బిడ్డ తల్లయింది లత. 'నీ అవ్వో జోగినీ, నువ్వు పతివ్రతవు తియ్యి. అసలు మీ కులమే అంత" అంటూ చెప్పాపెట్టకుండా అవుటాఫ్ పోవాలనుకున్నాడు రాజేశ్. లత పుట్టిల్లు చేరింది. ఇది చిన్నక్క కథ.

ఎర్రక్క కొడుకును బళ్ళో వేసింది. బడిలో అయ్యవారు "ఏమిరా ఎప్పుడూ మీ అవ్వనే అస్తది ఫీజుగట్టను, మీ అయ్యలేడా అన్నడట" అందుకు పిల్లలు సార్ ఆనందుకు అయ్యలేడు, వాళ్లమ్మ జోగిని అన్నారు. దాంతో పిల్లవాడు బడి మానేస్తానని హఠం పట్టాడు. బడికి వెళ్ళి ఏదైనా ఉంటే మమ్ములడగండి. పిల్లలను గాదని అయ్యవారిని గదమాయించింది ఎర్రక్క ఇది ఎర్రక్క గాథ.

గంగుకు లారీ డ్రైవరుకు ఇద్దరు పిల్లలు కలిగారు. తర్వాత రాక తగ్గిపోయింది. దాంతో రావడం మానేశావు పిల్లలను సాకడమెలాగా అని నిలదీసింది గంగు. "ఏందేలావు దుంకుతున్నవు. లగ్గం పెండ్లామొలె. ఏం గ్యారంటి ఈల్లు నాకే పుట్టిర్రు..... కాయిదమున్నదా పత్రమున్నదా. జోగుదానివి. లావు మాట్లాడ్తవు' అన్నాడు. పోలీసోళ్లదగ్గరకు పోతే ఫో! ఫో! జోగుదానా, ఓడికి కనుక్కున్నవో ఆయన్నంటున్నవు, ఎక్కతక్క మాట్లాడితె లోపటేస్త అన్నారు. కోర్టు కెళదామంటే మాదిగోల్ల దిక్కు ఆడోల్లదిక్కు జోగోల్ల దిక్కు అందులో కట్టలు లేనోళ్ల దిక్కు ఎవరు మాట్లాడతారని దిగులు పడుతుంది. ఇది గంగు గాథా. ఇలా ఒక్కొక్కరిది ఒక దీనగాథ.

అయినా అందరూ కష్ట సుఖాలు కలబోసుకుంటారు. ఒకరికి ఒకరు ఆసరా. చిన్నక్క కూతురు సంగతి తెలిసి అందరు ఏకమయ్యారు. జోగోల్ల పెద్ద గూండ్ల నర్సవ్వను కలిశారు. నర్సవ్వ వూరంతా ఇంటికొక బీడి పంచింది. అలా బీడీ పంచటమంటే ఆ బీడీ పంచినోళ్ళ పంచాయతీ తెల్లారి ఉన్నట్లు. అందరూ జోగోళ్ళేంది బీడి పంచుడేంది అని నోళ్లు నొక్కుకున్నారు. అందరూ జమ అయినారు. లత భర్త రాజేశు విదేశాలకు వెళ్లటం గూర్చి ఇరుప్రక్కల వాదోపవాదాలు జరిగాయి. డెబ్బై ఏండ్ల మాదిగ లస్మయ్య ఇంతమంది విదేశాలకు పోవడానికి, వారి కష్టనష్టాలకు భూమి లేకపోవటమే కారణమని తేల్చాడు. కుమ్మరి, గౌండ్ల, చాకలి, మంగలి అందరు కష్టాలు వెళ్లబోసుకున్నారు. అందరికి భూమి కావాలి. మరి ఎట్లా? ఉన్నోళ్ల భూమి గుంజుకోవాలని నిర్ణయానికొచ్చారు. దున్నేటోడిదే భూమి అన్నారు. మరి జోగోల్ల సంగతి! జోగోళ్ళు అందరూ ముందుకొచ్చారు. "మాకు మొగోల్లు లేరు గని పిల్లలున్నారు కద. కుటుంబాలున్నయి కదా. మాకు భూములు కావాల" అన్నారు.

జోగోళ్లకు భూమి ఎందుకన్నారు కొందరు. ఏమి ఆడోల్లు దున్నరా... ఆల్లకు ఏ పని రాదు.? ఏందో ఎకిలి ఎకిలి మాట్లాడుతరు. మాకు కడుపులున్నట్లే చేతులున్నయి. దమ్ముంటే రండ్రి. సూద్దురు ఎట్లు దున్నుతమో..., దున్నేటోల్లకే భూమి' అనుండ్రి. అట్ల ఆడోల్లుగానీ మొగోల్లుగానీ అంటూ అందరితో పాటు వేమూ అంటూ సిద్ధమయ్యారు.

ఈ నాలుగు కథలు పరిశీలిస్తే నడిమింటి బోడెక్క బసివిరాలయ్యేద-దళిత సంస్కృతిలోని పార్శ్వాన్ని బహిర్గతం చేస్తుంది. ఊరి పెద్దల దాష్టీకానికి, పెత్తందారీ తనానికి పసివయసులో జోగిని పేరుతో వసివాడే తతంగాన్ని విస్పష్టం చేశారు రచయిత. ఆతంతులో పాటించే యావత్తు ఆచారాలను జోగినిగా మార్చబోయే అమ్మాయి అలంకరణ తీరుతెన్నులు, జోగినిని విడిచే పద్ధతి, ఆ తతంగంలో పాల్గొనే పురుషుల పాత్ర, ప్రమేయం, దేవతను నిల్పడం, బలి ఇచ్చే వ్యవహారాన్ని విపులంగా కళ్ళ ముందుంచారు. అంతేకాకుండా అమాయకులైన పసిపాప జీవిత చౌర్యాన్ని, ఆ ఆచారంలోని మౌఢ్యాన్ని ఎండగట్టారు. కానీ తల్లిదండ్రులు "మాకేమొ వుండేది వొగితే కదా యాడన్నా బసివిరాల్ని ఇడుసుకుంటే కొండ్లు ముందు వుంటాదని ఆస. నీడపాట్న సుకంగ వుంటాది. ముసులు ముప్పుతనానికి మమ్ముల్ని మడసనంగా సూసుకుంటాదని మా అపలాసన" అనుకున్నారు.

బోడెక్క కంటికి మంటికి ఏకధారగా ఏడుస్తున్నా పట్టించుకునే నాథుడు లేడు. పైగా ఊరందరికి అదో వేడుక. ఆనందం. ఒక దురాచారాన్ని సమాజం ముందుకు సవాల్ గా విసరడంలో రచయిత కృతకృత్యుడయ్యాడు. ఆ ఆచారాన్ని నిరోధించే ప్రతిపాదనలు చేయలేదు. కాని ఒక దురాచారంలోని మౌఢ్యాన్ని, అనాగరికత్వాన్ని, చైతన్యరాహిత్యాన్ని, పురుష స్వామ్య వ్యవస్థలోని భోగలాలసతను గ్రామపెద్దల పెత్తందారీతనాన్ని, పేదరికం ఆసరాగా కొనసాగుతున్న ఆధిపత్యాన్ని అన్నెం పున్నెం ఎరుగని ఆడబిడ్డల అసహాయత్వాన్ని ఆచారం పేరుతో జరుగుతున్న దౌర్జన్యాన్ని ప్రస్ఫుటీకరిస్తూనే పురుషుల అంగలార్చేతనాన్ని, ఆచారంపట్ల విముఖతను రచయిత స్వరీకరించారు. ఈ ఆచారం పట్ల సమాజంలోని స్త్రీల మనోభావాలను వ్యక్తీకరించారు. ఈ దురాచారం వల్ల దళిత బాలికలకు ఆజన్మాంతం కలిగే దుర్భర జీవితం పట్ల రచయిత కంఠ స్వరం కథ ఆసాంతం గట్టిగా ప్రశ్నిస్తూనే ఉంది.

కలికి గాంధారి కథలో తల్లి పాత్ర గాంధారి, రడంలో పాప తల్లిదండ్రులు చైతన్య వంతమైన పాత్రలు. గాంధారి తన బిడ్డ రొంపిలో పడకుండా కాపాడడానికి హత్యచేసి జైలుకెళ్ళింది. రడంలో ఉన్న ఆస్తిపాస్తులను వదులుకొని బిడ్డ చదువే ముఖ్యమనుకున్నారు. జోగినీ వ్యవస్థను దెబ్బకొట్టారు. ఆవ్యవస్థ తరతరాలుగా కొనసాగాలనుకునే వూరి పెద్దలకు తగిన గుణపాఠం చెప్పారు. దరిలేని బావులు కథలో స్త్రీపాత్రలు తాము జోగినులని, జోగినులకు మానాభిమానాలుండవని అడుగడుగునా నిందలకు గురయి, బాధ పడినా వారి ఆలోచనా ధోరణి మాత్రం అభ్యుదయమైంది. తమలాంటి దుర్భర జీవితం తమ బిడ్డలకు వద్దని కోరుకున్నారు. అందుకోసం తమ శాయశక్తులా తిరుగుబాటు ధోరణిని ప్రదర్శించారు. లత సమస్య విషయంలో మూకుమ్మడిగా ఎదురుతిరిగారు. పంచాయితీ పెద్దలతో మాటకు మాటా సమాధానమిచ్చారు. తమకు అందరిలాగే భూమి పుట్ర ఉంటే, పనీపాటా చేసుకోగల సత్తా, చాకచక్యం ఉందని చాటిచెప్పారు.

బసివి, జోగినీ వ్యవస్థ తరతరాలుగా కొనసాగాలనే తత్త్వం వూరి పెత్తందార్లది. తమతోనే అంతంకావాలనీ, తమ బిడ్డలు వివాహాలు చేసుకొని పిల్లాపాపలతో సుఖసంసారాలు గడపాలనేది జోగినుల అభిలాష, సమాజ నైజాన్ని, జోగినుల పట్ల ఉన్న చులకన భావాన్ని ఎండగట్టి, సంప్రదాయం పేరుతో దళిత, వెనుక బడిన వర్గాల స్త్రీలను లైంగిక దోపిడీ చేయడాన్ని నిరసిస్తూ, జోగినీ వ్యవస్థ రూపు మాసిపోవాలనీ జోగినులకు అండగా నిలిచింది తెలుగు కథా సాహిత్యం. జోగినీ వ్యవస్థ నిర్మూలనకోసం ప్రభుత్వం కృషిచేస్తున్నా, ఇంకా అక్కడక్కడా కొనసాగడం విచారకరం. ■

# దీపాలు

- రత్నా మహీధర్
సెల్: 9985793934



అదేమిటో ఒక్కోసారి
దీపాలన్నీ చీకటిగానే తోస్తాయి
కొన్ని మినుకు మినుకుమన్నా
అన్నీ దేదీప్యమానంగా ఉండవు
మేం వెలుగునిస్తాం సుమా
అంటూ పరిచయం చేసుకుంటాయి
వెలుగు నివ్వటమంటే సామాన్యమా?
ప్రపంచాన్ని గుప్పెట్లో ఇరికించడం కాదూ?
అది ఈ దీపాల వల్ల అవుతుందా?
అవేం వెలుగులో
అంగుళం కూడా సరిగా కనపడదు
చూడలేరంటూ దృష్టిని
మూట కట్టేసుకుంటాయి
ప్రపంచమంతా వాటితోటే ఉన్నట్లు
ఒక నిమిషమేనా సరిగ్గా చూడనివ్వవు
ఎంతటి విద్యావంతులైనా
వాటి ధాటికి ఆగలేరు
గమనం సుగమం కాలేదు
ప్రపంచమంతా నిశ్చలంగా వున్నా
తాము మాత్రం నటిస్తూనే ఉంటాయి
చీకటి భుజాన వేసుకొని
వెలుగు పిండిని జాలువారుస్తాయి
జ్ఞానాన్ని పాతిపెట్టి దీపాన్ని
తిడితే లాభమేమిటి?
చెట్టు ఎదగలేదని మట్టిని కరపిస్తే ఏం లాభం
చీకటిని సంచిలో పెట్టి
దీపాన్ని కర్రకు కట్టు
అదే వెలిగిస్తుంది జ్ఞానదీపం

**(హైదరాబాద్ సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో సాహితీ స్రవంతి ప్రతి నెలా నిర్వహిస్తున్న జనకవనంలో చదివిన కవిత)**

# ఆమె

- ముకుంద రామారావు
సెల్: 99083 47273



ఆమె అందం ఆమెకు తెలియదు
ప్రకృతిలా ఆమె గుడ్డి

అల్లల్లాడే ఆకుల మధ్య పూల నవ్వులా
ఆమెను తలుచుకుంటే పోగయే పదాలు
ఎదురుపడితే నెమ్మదిగా
నా వెనుక దాక్కుంటాయి

ఆమె గదికి నేను
నా గదికి ఆమె
కిటికీలమేమో

నిద్రలో రాత్రంతా గుసగుసలాడినవే
మెలకువలో కలలు కలలై ఊరిస్తాయి

ఎత్తయిన కొండెవరో
ముద్దాడిన మేఘమెవరో

మరణమంత తీవ్రమై
కళ్ళల్లో ఎంత స్పష్టంగా కనిపిస్తున్నా
నిరూపించాల్సిందేనా ప్రేమ

శతాబ్దాలూ చాలవా
నిజమైన ప్రేమను మరచిపోవడానికి

# వలువలు - విలువలు

- పాటిబండ్ల ధనలక్ష్మి



విలువలు లేని వలువలు
వలువలు లేని విలువలు
చలనం లేని శిలలు
ఫలితం లేని కలలు
వెలయాళ్ళు వెలివేసిన వలువలు
విలువలు కోల్పోయి విలవిల లాడుతున్నాయి
వెలువకనే వెలిసి వెలవెలబోతున్నాయి
విలువ తెచ్చే వెలయాలు వేసుకొన్న
వెలిసిన వలువలు కూడా
కలువల్లా కళకళ లాడుతున్నాయి
తారల్లా తళతళ లాడుతున్నాయి

వలువల కున్న విలువను బట్టి కాక
వేసుకున్న వారి వ్యక్తిత్వాన్ని బట్టి
విధిగా గౌరవించినప్పుడే
అనాదిగా వస్తున్న సామాజిక విలువలు
ఎన్నో తరాలు నిలిచి వుంటాయి
నిన్నూ నన్నూ అలరిస్తాయి!

# నానీలు

- బండి ప్రసాదరావు



అవి చిరుజీవుల
సమాధులా?
ఔను! ఘనీభవించిన
కన్న కడుపులు

జ్ఞాపకాలు నిజంగా
ఓ అనుభూతి!
వ్యాపకాలలో
హృదయం ఆహుతి

నిజమే
వివాహం స్వర్గంలో
సంసారం మాత్రం
ఆటుపోట్ల సాగరంలో

అందమైన ముక్కెర
ఆకుముక్కున
మంచుబిందువు
మెరిసెరా!

ఆత్రంగా వచ్చి
కాళ్ళపై పడింది
తేరిపారజూస్తే
అది కెరటం..

విమానంగా దిగి
ఎత్తుకుపోయింది గ్రద్ద
అమెరికా చేసిందీ
అదేగా!!

కథ

# కాలక్షేపం

- ముక్కామల దేవీ నాగ మోహనరావు



**ఆమె 'మయూరి' హోటల్ నుండి బయటకు రావడం అతడు చూశాడు. ఆమె చూపులు కూడా చటుక్కున తన మీద పడటంతో అతడికి ఒళ్ళంతా సిగ్గుతో చచ్చిపోయినంత పనయ్యింది. తడబాటుతో ఆమె చూపుల్ని తప్పించుకోవడానికి చేసిన విఫలయత్నంలో అతడి చేతిలో వున్న ఆకులోని సేమ్యా పులిహోర కొంత నేల జారింది. కొన్ని క్షణాల తరువాత అనుకోకుండానే అతడి కళ్ళు ఆమె కేసి చూశాయి. ఆమె యింకా అతడివైపే చూస్తూ వుంది. ఎప్పుడయినా రోడ్డు మీద ఎదురుపడితే, అదీ చాలా అరుదుగా - సంవత్సరానికి ఒకసారో, రెండుసార్లో - తననెప్పుడూ గుర్తించనట్లే వుండేది. ఇప్పుడిలా తనకేసే తదేకంగా చూడటం అతడికి వింతగానూ, ఆశ్చర్యంగానూ వుంది.**

హోటల్ మెయిన్ రోడ్డును ఆనుకొని వుంది. దానికి ఎడమవైపు సందు మొగలో ఒక పెద్ద డ్రెయిన్ బద్ధకంగా ప్రవహిస్తూ వుంటుంది. డ్రెయిన్ పక్కనే వున్న టిఫిను బండి దగ్గర సేమ్యా పులిహోర కొనుక్కొని ఆత్రంగా తింటూ ఆమెకు దొరికిపోయాడతడు. నోట్లో వున్న సేమ్యా నోట్లోనే వుండిపోయింది. నమలడానికి నోరు ఆడించాలన్న సంగతినే మరిచిపోయినంత పనయ్యింది. గబగబా బండి వెనక్కు తప్పుకొని, తన వీపు మాత్రమే ఆమెకు కనబడేలా నిలబడ్డాడు. రెండు మూడు నిమిషాలు ఆగిన తరువాత వెనక్కు తిరిగి చూశాడు. ఆమె అక్కడ లేదు. అతడి చూపులు బిడియంగా  చుట్టూ పరిసరాల్ని గాలించాయి. ఎక్కడా వున్నట్లు లేదు. ఇక అతడి నోటికి సేమ్యా రుచించలేదు. డబ్బులిచ్చాడు కాబట్టి మిగిలిన దానిని నోట్లో కుక్కుకుని, అక్కడే వున్న నీళ్ళ డ్రమ్ము కుళాయి దగ్గర చెయ్యి కడుక్కుని, గుక్కెడు నీళ్ళు నోట్లో పోసుకున్నాడు. ఆ తరువాత ఏం చేయాలో తోచక, యింకా తెల్లబోతూనే కొంతసేపు అలానే నిలబడిపోయాడు.

'మయూరి' హోటల్ కాకినాడలో టూటౌన్‌కు సమీపంలో బాగా జనసమ్మర్ధం గల ప్రాంతంలో వుంది. అధునాతనమైనది. అయితే దానికి బాగా దగ్గరలో ఒక పెద్ద మురుగు కాలవ ప్రవహిస్తూ ఉండటం, దాని పక్కనే ఒక తోపుడు బండిలో టిఫిన్ల అమ్మకం జరుగుతూ ఉండటం హోటల్ అందాన్నీ, హుందాతనాన్నీ చెడగొడుతున్నాయి. హోటల్ యజమాని డ్రెయిన్ను దారి మళ్ళించి పూడ్పించేయడానికి, తోపుడు బండి టిఫిను వ్యాపారం చేసే యువకులిద్దర్నీ అక్కడి నుండి తరిమెయ్యడానికి చేయని ప్రయత్నమంటూ లేదు. హోటల్ అక్కడ వెలసి సంవత్సరమో, సంవత్సరంన్నరో అయింది. కాని ఆ తోపుడు బండి వ్యాపారం గత పాతికేళ్ళుగా అక్కడే జరుగుతూ వుంది. అదీగాక సందులో వున్న షాపింగు కాంప్లెక్సులోని వ్యాపారులకు డ్రెయిన్ వలన పెద్ద ఇబ్బందేమీ లేకపోవడం, రోడ్డుకు అటూ ఇటూ చిల్లర వ్యాపారాలు చేసుకునే వాళ్ళకు అందుబాటులో ఒకే ఒక టిఫిను బండి వుండటం కారణాలుగా హోటల్ యజమాని ప్రయత్నాలు తరచుగా బెడిసికొడుతున్నాయి.

ఆ తోపుడు బండి వ్యాపారాన్ని ఇద్దరు వైశ్య కుర్రాళ్ళు నడుపుకుంటున్నారు. రోజూ సాయంత్రం నాలుగు, నాలుగున్నర అయ్యేసరికి బండి అక్కడ ప్రత్యక్షమవుతూ ఉంటుంది. ఎక్కడో దగ్గరలోనే వున్న తమ నివాసం నుండి దాన్ని వాళ్ళు తోసుకు వస్తారు. చిన్న కుర్రాళ్ళుగా వున్నపుడే వ్యాపారాన్ని ప్రారంభించిన ఆ అన్నదమ్ములిద్దరూ ఇప్పుడు పెద్ద వాళ్ళయ్యారు. పెళ్ళిళ్ళు అయి పిల్లలు కూడా పుట్టుకొచ్చారు. వాళ్ళ తోపుడు బండి, చుట్టూ తినడానికి మూగిన రకరకాల మనుషులతో ఎంత కళకళలాడుతూ వుంటుందో, వేళ్ళమీద లెక్కించడానికి వీలయ్యే విధంగా వచ్చే 'హై సొసైటీ' మనుషులతో 'మయూరి' హోటల్ అంత వెలవెలబోతూ వుంటుంది. అది హోటల్ యజమానికి చాలా కంటగింపుగా మారింది. చాలాకాలంగా అతడికేం చేయాలో పాలుపోవడం లేదు. హోటల్ బయట తెల్లని యూనిఫాంలో ఒక వెయిటర్ను ఏర్పాటు చేశాడు. వాడు హోటల్‌కు వచ్చే 'ఖరీదైన' మనుషులకు 'వెల్‌కం సర్!' 'నమస్తే సర్!' అంటూ ఆహ్వానం పలుకుతుంటాడు. అప్పుడప్పుడు 'మయూరి' హోటల్ కూడా సందడిగానే వుంటుంది. అల్ట్రా మోడర్న్ దుస్తుల్లో వచ్చే యువతీ యువకుల్తోనూ, వారి ఆంగ్ల సంభాషణల్తోనూ! హోటల్ ఎడమ వైపు సందు వెనక్కు కొంత దూరంలో అంతమయిపోతుంది. హోటల్‌కు కారుల్లో వచ్చేవాళ్ళు హోటల్ ముందుభాగంలో పార్కింగ్ స్థలం చాలకపోవడంతో కార్లను సందులో కూడా పార్కు చేస్తూ వుంటారు. ఆ కారణంగా సందెపుడూ వాహనాలతోనూ, మనుషులతోనూ కిక్కిరిసిపోయి వుంటుంది. సందులో పార్కింగ్ స్థలం తక్కువవుతూ ఉండటం, ఒక విధంగా వ్యాపారానికీ దెబ్బ తగులుతూ వుండటంతో హోటల్ యజమాని ఆ తోపుడు బండి కుర్రాళ్ళనెలా తరిమెయ్యడమా అని నిరంతరం బుర్ర బద్దలు కొట్టుకుంటూ ఉంటాడు.



హోటల్ వ్యాపారం దెబ్బతింటూ వుండటానికి కారణాలున్నాయి. బండిలో దొరికే పదార్థాలు పేదవాళ్ళకు, చుట్టుపక్కల కార్ఖానాల్లో పనిచేసే కార్మికులకు, రిక్షావాళ్ళకు అందుబాటు ధరల్లో దొరుకుతాయి. ఐదు రూపాయలకు రెండు ఇడ్లీలు, నాలుగు రూపాయలకు ఒక పల్చని మినపట్టు, మూడు రూపాయలకు ఒక గరిటెడు ఉప్మా... అలా.. పదార్థాల రుచి కూడా అద్భుతంగా వుండటంతో మధ్య తరగతి మనుషులు – అంటే సూక్ష్మంలో మోక్షం కొట్టేయాలనుకునే బాపతు – అధిక సంఖ్యలో బండి చుట్టూ మూగుతారు. సామాన్యులకు కాస్త ఎడంగా నిలబడి తమ ప్రత్యేకతను చాటుకుంటూనే! ఇడ్లీలు, మినపట్లు, మినప రొట్టె ముక్కలు – మజ్జిగలో నానబెట్టిన వాటితో సహా, ఉప్మా, మసాలా ఉప్మా, ఉప్పుడు పిండి పులిహోర, పూరీలు, బొబ్బట్లు, సున్నుండలు... వీటన్నింటిని చూస్తుంటే ఎవరికి మట్టుకు నోరూరదు? అందునా తక్కువ ధరల్లో దొరుకుతూ వుంటే?

'డబ్బులు తర్వాత ఇద్దురుగాని సార్! ముందు తినండి' అంటారు ఇద్దరు కుర్రాళ్ళు.

కనీసం 'అప్పర్ మిడిల్' క్లాసైనా 'మయూరి' ముఖం చూడకపోవడం హోటల్ యజమానికి కష్టంగానే వుంటుంది మరి!

ఆ నల్లని వైశ్య కుర్రాళ్ళకు తండ్రి లేడు. వాళ్ళ చిన్నతనంలోనే పోయాడు. తల్లి తయారు చేసి ఇచ్చిన పదార్థాలను చిన్నవాళ్ళుగా వున్నపుడు బుట్టలలో తెచ్చి సాయంత్రం వేళల్లో ఈ సెంటర్లోనే అమ్మేవాళ్ళు. క్రమంగా వ్యాపారం పెరగడంతో నాలుగు చక్రాల బండినొకదానిని ఏర్పాటు చేసుకున్నారు. మేడలూ, మిద్దెలూ సంపాదించేంత కాకపోయినా వారి జీవనోపాధికి ఏమాత్రం లోటు లేకుండా వ్యాపారం వృద్ధి చెందింది. వ్యాపారంతో పాటే ఆ కుర్రాళ్ళు ఎదిగారు. తల్లీ కొడుకుల అమృత హస్తాలలో తయారయిన ఆ పదార్థాలకు వారి ఇంటికి వచ్చిన కోడళ్ళ కోమల హస్తాలు తగిలి అవి దివ్యమైన రుచుల్నీ, పరిమళాల్నీ సంతరించుకుంటున్నాయి.

అతడు మనసులో చాలా కించపడుతూనే అక్కడికి దగ్గరలోనే వున్న కుళాయి చెరువు చిల్డ్రన్ పార్కు వైపు నడక సాగించాడు. ఫ్యాక్టరీలో పనయిపోయిన తరువాత సాయంత్రం పార్కులో ఎవరికీ కనబడనట్లుగా ఒక మూల కూర్చుని ఏకాంతాన్ని అనుభవించడం అతడి దినచర్యలో సాధారణంగా ఒక భాగం. పదేళ్ళ క్రితం వరకూ కుళాయి చెరువు చుట్టూ ఫెన్సింగుతో సామాన్యంగా వుండేది. ఫెన్సింగు లోపల రకరకాల చెట్లు, విశాలమైన పచ్చిక ప్రదేశం, మధ్యలో పెద్ద చెరువు, సంజ వెలుగుల్లో తళుకులీనే అందులోని నీళ్ళు ప్రకృతి సౌందర్యాన్ని ఒకింత ఒడిసి పట్టుకునే అవకాశాన్ని కల్పించేవి. పెద్దవాళ్ళు సాయంత్రం వాకింగ్ చేయడానికో, చెరువు గట్టునో, చెట్ల కిందనో కూర్చుని కబుర్లు చెప్పుకుందుకో ఎక్కువగా వచ్చేవారు. అతడు మాత్రం ఒక మూల ఒక సిమెంట్ దిమ్మ మీద కొంతసేపు కూర్చుని వెళ్ళిపోతుండటం ఈనాటికీ కొనసాగుతూనే వుంది. గత పదేళ్ళలో కుళాయి చెరువు ఎంతో ఆధునికీకరణకు గురయ్యింది.

చెరువులో బోటు షికారుకు వీలు కల్పించారు. పిల్లల కోసం స్కేటింగ్ రింకు నిర్మాణం జరిగింది. కాళ్ళకు కాన్వాస్ షూలు వేసుకుని, వాటికి స్కేటింగ్ రోలర్స్ తగిలించుకొని ఒకేసారి ఏభైమంది చెరువులో బోటు షికారుకు వీలు కల్పించారు. పిల్లల కోసం స్కేటింగ్ రింకు నిర్మాణం జరిగింది. కాళ్ళకు కాన్వాస్ షూలు వేసుకుని, వాటికి స్కేటింగ్ రోలర్స్ తగిలించుకొని ఒకేసారి ఏభైమంది పిల్లలు స్కేటింగ్ చేయడానికి వీలయ్యేంత విశాలమైన గ్రౌండ్ అది. బోటు షికారుకు క్యూలు కట్టే పిన్నలు పెద్దలతో, ఉయ్యాల బల్లలు జారుడు బల్లల దగ్గర పిల్లల కేరింతలతో, స్కేటింగ్ గ్రౌండ్ చుట్టూ నిలబడి స్కేటింగ్ చేసే పిల్లలను చూసి ఆనందించే పిల్లల తాలూకు వాళ్ళు ఇతరులతో, పసుపు పచ్చని విద్యుద్దీప కాంతుల్లో వెలిగిపోతూ పార్కంతా చాలా ఉత్తేజభరితంగా వుంటుంది. ఈ మానవ కల్పిత సౌందర్యాన్ని ఆస్వాదిస్తూ పార్కు లోపల చుట్టూ ఏర్పాటు చేసిన స్టీలు బెంచీల మీద అన్ని వర్గాల ప్రజలూ

కూర్చుంటుంటారు. అన్ని వర్గాల వారి కోసమే అయినా అతని వంటి వారు ఎందుకనో ఆ అందమైన బెంచీల మీద కూర్చొన సాహసించలేరు. ఇన్ని సంవత్సరాల సుదీర్ఘ కాలంలో కూడా తను ఒక మూల మామూలుగా కూర్చునే సిమెంట్ దిమ్మ ఏదో పురాతన అవశేషంలా యింకా మిగిలి వుండటం అదృష్టంగానే భావిస్తాడతడు.

సంవత్సరాల తరబడి ఘనీభవించిన సంకోచంతో ఒదిగి ఒదిగి అడుగు వేస్తూ పార్కులోకి ప్రవేశించి తను కూర్చునే సిమెంట్ దిమ్మ వైపు కదిలాడతడు.

అంతలో

"నీ పేరు దేవీ కదా!" అని ఎవరో అన్నారు.

అతడు కొంచెం కంగారుపడ్డాడు. ఎన్నో ఏళ్ళ అనంతరం అకస్మాత్తుగా 'దేవీ' అనే పిలుపు విని అతడి కాళ్ళు తడబడ్డాయి.

మెయిన్ గేటుకు దగ్గరగా గులాబీ మొక్కలు ఆవరణ మధ్యన, నేలకు స్టీల్ రాడ్స్‌తో బిగించిన ప్లాస్టిక్ కుర్చీల వరుసలో ఒక దాంట్లో ఆమె మహారాజ్ఞిలా వెలిగిపోతూ కూర్చుని వుంది.



అతడు సమాధానమివ్వకుండా బిడియ పడుతూ నిలబడి వుండటం చూసి, ఆమె నవ్వుతూ

"నిన్నే ! యిలారా..." అని పిలిచింది.

అతడు మెల్లగా ఆమె వైపు అడుగులు వేశాడు.

"గుర్తు పట్టావా?" అడిగిందామె ఇంకా చిరునవ్వు చిందిస్తూనే.

"మీరు ఇందుమతి..." అతడు తడబడ్డాడు.

"ఇందుమతినే! యిలారా.. యిలా కూర్చో" అందామె ఆప్యాయంగా.

ఆమె కళ్ళల్లోని ప్రసన్నత, వదనంలోని ప్రశాంతత, గొంతులోని ఆర్ద్రత అతడిని ఆశ్చర్యచకితుణ్ణి చేశాయి. ఎందుకనో కళ్ళు చెమర్చినట్లుగా అయింది. ఎన్ని సంవత్సరాలు గడిచాయి...! తననామె గుర్తించింది. గతంలోనూ గుర్తించే వుంటుంది. మరి ఇన్ని సంవత్సరాల కాలంలో ఎందుకు గుర్తించనట్లుగా వుంది? వయసులు గడచిపోయాయి. పరిసరాల్లోనే వుంటున్నా ఒకరినొకరు గుర్తించనట్లుగానే ఎవరివి వారివి సుదీర్ఘ ప్రయాణాలు జరిగిపోయాయి. ఇప్పుడు ఈ చివరి అంకంలో...

అతడి ఆలోచనల్ని పసిగట్టినట్లుగా ఆమె

"నిన్ను నేను చాలా సంవత్సరాలుగా చూస్తూనే వున్నాను. పాపం నాకేసి భయపడుతూ భయపడుతూ చూస్తుంటావు. సినిమా స్ట్రీట్‌లో నడిచి వెళ్తుంటావుగా..." అందామె మృదువుగా.

అతడు ఒక వెర్రి నవ్వు నవ్వాడు.

"ఇంకా పనిచేస్తున్నావా?" అనడిగిందామె ఆశ్చర్యంతో అతడిని పరిశీలనగా చూస్తూ.

మాసిపోయిన బట్టలు. బట్టల నిండా ఆయిలు మరకలు. పూర్తిగా తెల్లబడి పీచులా మారిపోయిన జుత్తు. కొంచెం వొంగినట్లుగా వుండే శరీరం. తనను తను చూసుకోవడానికే చాలా సిగ్గుపడ్డాడతడు. ఉన్నట్టుండి తను మాయమయిపోతే బాగుండునని అనిపించిందతడికి.

ఆమె అతడి కేసి జాలిగా చూసింది.

ఊరడిస్తున్నట్లుగా

"ఎందుకలా యిదైపోతావు? రా! ముందిలా కూర్చో" అని తన పక్కనున్న కుర్చీని చూపించింది.

కాని అతడు ఆమెకు రెండు కుర్చీలు ఎడంగా కూర్చున్నాడు.

"మనిద్దరమూ కలిసి చదువుకున్నాము. మనలో మనకు ఎక్కువ తక్కువ భేదాలేముంటాయి? ఊс! చెప్పు ఎక్కడ పనిచేస్తున్నావు?" అందామె.

"క్రిష్ణా ఆటోమొబైల్స్‌లో స్పేర్ పార్ట్స్ తయారు చేసే యూనిట్లో చేస్తున్నాను.

"ఎస్సెల్సీ అయింతరువాత నువ్వెక్కడా కనిపించలేదు."

"అమలాపురం నుండి కాకినాడ వచ్చేశాము. ఇక్కడే ఐటిఐలో ఫిట్టరుగా ట్రైనింగయ్యాను."

ఈసారి అతడు సంకోచాన్ని కొంచెం పక్కనపెట్టి ఆమెను పరిశీలనగా చూశాడు.

ఆమెకూ తన వయసే వుంటుంది. తనకు అరవై పూర్తవుతున్నాయి. బంగారపు రంగు అంచుతో వున్న గోధుమ రంగు చీర, బ్లౌజుల్లో ఆమె వయసు మళ్ళినా కూడా అందంగానే వుంది. నొసటను ఎర్రని కుంకుమ బొట్టుతోను, మెడలో పచ్చని తాళి, చిన్న లాకెట్‌తో వున్న పొడవైన హారంతోనూ ఆమె ఎంతో హుందాగా వుంది. చిన్నతనంలో లానే ఆమె జుత్తు ఇంకా ఒత్తుగా, పొడవుగానే వుంది. కాని అక్కడా అక్కడా తెల్లబడి వుంది. తెల్లని పొడవైన శరీరం. కాంతులీనే ముఖవర్చస్సు. వయసులోని సోయగాల్ని కొన్నింటిని పోగొట్టుకున్నా కాలం తెచ్చిన కొంగ్రొత్త అందాలనామె నిలువునా సంతరించుకొని వుంది.

తను! అతడి మోములో విచారంతో కూడిన చిన్న హాసం నీరసంగా మెరిసింది. 'ఏయ్ తాతా!' 'రేయ్ ముసలోడా' వంటి సంబోధనల్నే తను తరచుగా ఎదుర్కొంటూ వుంటాడు. వయసు అరవై నిండుతున్నా జీవనోపాధికి యింకా పని చెయ్యాల్సిన దుస్థితి తనది.

అతడి కళ్ళు ఆర్ద్రాలవుతున్నట్లుగా అనిపించి కొంచెం నొప్పి పెట్టాయి.

చిన్న గాలి దుమారం రేగింది. వేడిగాలి ముఖానికి కొట్టింది.

ఆమె నగరంలో ఒక పెద్ద కార్డియాలజిస్టు భార్య. సినిమా వీధిలో వాళ్ళకు విశాలమైన రెండతస్తుల భవనం వుంది. సాయంత్రం

సమయాల్లో బాల్కనీలో నిలబడి రోడ్డు వైపు చూస్తూ వుంటుంది. తను ఆ దారిన పోతున్నపుడు తనకేసి చూస్తున్నట్లుగానే వుంటుంది. తను ఆమె వైపు చూడగానే ముఖం తిప్పుకుంటుంది.

"పెద్ద వాళ్ళమయిపోయాము." అందామె ఎక్కడో దూరంగా చూస్తూ.

అతడు నీర్సంగా నవ్వాడు.

ఒకసారి స్కూలు యానివర్సరీ డే సెలబ్రేషన్ల సందర్భంగా పిల్లలకు రకరకాల ఆటల పోటీలు నిర్వహించారు. ఇందులో ఒక పోటీని తమ మేడమ్ పెట్టింది. ఒక ఖాళీ డబ్బాలో ఏవేవో చిన్న చిన్న వస్తువుల్ని వేసి చూడకుండా చేతుల్తో తడిమి వాటి పేర్లు చెప్పడం. ఆ సమయంలో ఇందుమతి డబ్బాలో చెయ్యి పెట్టగానే తనూ చటుక్కున అందులో చెయ్యి పెట్టాడు. ఆమె వేళ్ళను తాకాలని. ఇందుమతి వెంటనే చెయ్యి వెనక్కు తీసుకుంది. కొంచెం తెల్లబోయి చూసింది. తను కాస్సేపటి వరకూ తలెత్తుకోలేకపోయాడు.



ఇందుమతి బ్రాహ్మలమ్మాయి. ఆ రోజుల్లో ఎంత అందంగా వుండేది. తెల్లని ఒళ్ళు. పెద్ద పెద్ద కళ్ళు. ఎర్రని పెదవులు. పొడవుగా ఒత్తయిన జుత్తు. లంగా, జాకెట్టు, ఓణీలు వేసుకొని రోజుకో విధంగా వచ్చేది. క్లాసులో ఇంకా అమ్మాయిలున్నా మగపిల్లందరి దృష్టి ఆమె మీదే! ఆ రోజుల్లో 'లవ్ లెటర్' అంటే తామందరూ హడలి చచ్చేవాళ్ళం. క్లాసులో రామం అని ఒకడు ఇందుమతిలానే తెల్లగా, పొడవుగా, అందంగా వుండేవాడు. వాడికి ఇందుమతి అంటే చచ్చేంత ఇష్టం. ఆమె కనబడటంతోనే తన అరచెయ్యిని నోట్లో పెట్టుకుని గట్టిగా కరుచుకునే వాడు. తన ఆనందాన్ని అలా వ్యక్తం చేసేవాడు. అక్కడితో సరిపెడితే బాగుండిపోయేది. ఒకరోజు ఇందుమతికి లవ్ లెటర్ రాసి పుస్తకంలో పెట్టి ఇచ్చాడు. తరువాత ఇందుమతి హెడ్మాస్టరు గారికి కంప్లైంట్ ఇవ్వడం, రామంగాడికి గట్టి వార్నింగ్ తగలడం జరిగాయి. ప్రతీకారంగా రామంగాడు ఒక రోజు అందరికంటే ముందుగా క్లాసుకు వచ్చి ఆడపిల్లల బెంచీలో ఇందుమతి కూర్చునే చోటు కెదురుగా డెస్కు మీద 'గుజ్జు' అని పెద్ద పెద్ద అక్షరాలతో రాశాడు. పనిలో పనిగా మిగిలిన అమ్మాయిల మీద కూడా వాడి అభిప్రాయానికి అక్షర రూపం ఇచ్చాడు. ఆ తరువాత పెద్ద గొడవ జరిగింది. ఇందుమతి అమలాపురంలో ఒక పెద్ద డాక్టరుగారి మనవరాలు. రామంగాడిని ఒక వారం రోజులు సస్పెండ్ చేశారు.

జ్ఞాపకాల దొంతరలో ఓలలాడుతుండగా అతడి మోముపై చిన్న చిరునవ్వు విసిరింది.

"ఏవిటి నవ్వుతున్నావు?" అందామె చురుగ్గా చూస్తూ.

"రామంగాడు జ్ఞాపకం వున్నాడా? వాడు మీకు 'గుజ్జు' అని పేరు పెట్టాడు."

ఆమె ముఖంలో ఒక క్షణం సీరియస్‌నెస్ కనిపించి వెంటనే మాయమయ్యింది. ఆమె చిన్నగా నవ్వుతూ...

"ఇప్పుడెక్కడున్నాడు?" అనడిగింది.

"అమలాపురంలోనే. వాడికి పెద్ద పళ్ళ దుకాణం వుంది."

"అవును. మా అందరికీ పేర్లు పెట్టాడు. మరి 'మాలతి' అని ఒకమ్మాయి వుండేదిగా. దానికి 'చెంబు' అని ఎందుకు పేరు పెట్టాడు?"

"రోజూ పొద్దున్నే గొల్లల వీధిలోకి వెళ్ళి చెంబుతో పాలు తెచ్చేది. గొల్లల వీధికి రామంగాడి ఇంటి ముందు నుండే వెళ్ళాలి."

"ఓ! అదా!" అందామె నవ్వును కొనసాగిస్తూ.

మళ్ళా ఆమే,

"నువ్వొక రోజు చిరిగిపోయిన లాగు వేసుకొచ్చావు. నీ వెనక అందరూ నవ్వుతుంటే 'ఏంటి?' 'ఏంటి?' అని అందర్నీ అడుగుతున్నావు. జ్ఞాపకం వుందా? నీ లాగు వెనకాల చిరిగిపోయింది.

ఇందుమతి ఈసారి పెద్దగా నవ్వింది.

అతడు సిగ్గు పడిపోయాడు. ఒక వెర్రి నవ్వు నవ్వాడు. చేతుల్తో ముఖం మీది చెమటను తుడుచుకున్నాడు.

పేదరికం మరి. రోజుకు ఒక పూట కూడా సరిగా తినడానికుండేది కాదు.

"నిన్ను సరిగ్గా అప్పుడే రాయుడు మాష్టారు ఎందుకో బెంచీ ఎక్కమన్నారు. చిరిగిపోయిన లాగూతోనే ఎక్కి నిలబడ్డావు. క్లాసంతా నవ్వులు. ఆడపిల్లలం మేవయితే నవ్వునాపుకోవడానికి ఎన్ని తిప్పలు పడ్డామో!"

ఆమె చిరిగిపోయిన లాగు విషయం కొనసాగించడంతో అతడు విలవిలలాడాడు.

ఆమె మాట మార్చింది.

"ఊళ్ళో ఎక్కడుంటున్నావు?"

"గాంధీనగరంలో"

"సొంతిల్లా?"

"కాదు. అద్దెకుంటున్నాను." అతడు గొణిగాడు.

"పిల్లలేం చేస్తున్నారు?"

"ఒక్కడే కొడుకు. ఈ మధ్యనే యాక్సిండెంట్‌లో పోయాడు. ఆ తర్వాత కోడలు కూడా జబ్బుపడి పోయింది. మనవరాలుంది. నాలుగేళ్ళు. ఆవిడ, నేను, మనవరాలు అంతే...." అతడు నిర్లిప్తంగా చెబుతూ ఆగిపోయాడు.

ఆమె వెంటనే

"అయ్యో! అయాం సారీ!" అంది.

పార్కులో జనం సందడి పెరిగిపోతూ వుంది. చీకటి పడటానికిక ఎంతో సమయం లేదు. అప్పటికే విద్యుద్దీపాల వెలుగులో పార్కు ధగధగలాడుతూ వుంది.

"ఇంకా ఈ వయసులో ఏం పనిచేస్తావు... రెస్టు తీసుకోవచ్చుగా.." అందామె.

అతడు మాట్లాడలేదు.

ఆమె ఆలోచిస్తూ...

"అవున్లే... పాపం.... " అంది.

ఆమె రోడ్డు మీద పరుగులు తీస్తున్న వాహనాల మీద దృష్టి నిలిపింది.

అతడు కొంచెం ధైర్యం తెచ్చుకొని.

"ఇన్ని సంవత్సరాలుగా నన్ను చూస్తున్నారు. ఎప్పుడూ గుర్తు పట్టనట్లే ఉండేవారు..." అని ఆమె ముఖంలోకి చూశాడు.

ఆమె ఏమాత్రం తడుముకోలేదు.

"హై సొసైటీ మనుషులం కదా! నీలాంటి వారితో మాట్లాడితే మా పరువేం గానూ?" అంది నవ్వుతూ.

అతడూ నవ్వాడు.

"మీ పిల్లలేం చేస్తున్నారు?"

"ఇంకా పిల్లలేవిఁటి? పెద్ద పెద్ద డాక్టర్లయితేను! వాళ్ళ పిల్లలు కూడా డాక్టర్లే! ఇక్కడ లేరు. అందరూ యు.ఎస్.ఎ.లో వున్నారు."

"అంత పెద్దింట్లో మీరిద్దరే వుంటున్నారా! తోడుగా పిల్లలుంటే బాగుండేది."

ఆమె అతడి కేసి అదోలా చూసింది. తరువాత తన వాచీ కేసి చూసుకుంది. కొన్ని క్షణాలు ఆగి..



"ఆ బండి దగ్గర ఏవిటి తింటున్నావు?" అనడిగింది.

అతడు సిగ్గుపడిపోయాడు.

"ఏదో పేదవాళ్ళం... " అని గొణిగాడు.

ఆమె ఏదో ఆలోచిస్తున్నట్లుగా,

"ప్రేమలూ, ఆప్యాయతలు, అనుబంధాలు మీ పేదవాళ్ళ దగ్గరే వుంటాయి. జీవితానికి నిజమైన అర్థం మీలాంటి వాళ్ళ దగ్గరే దొరుకుతుంది. మా జీవితాల్లో ఏముంది... తళుకులూ.. బెళుకులూ... అంతా మెకానికల్, ఆర్టిఫిషియల్. జీవితాలంటే మీవి. శ్రామికులు, కర్షకులు, కార్మికులు... 'శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనే లేదని...' ఎవరూ అంటా? శ్రీశ్రీ కదూ. ఎంత వాస్తవం!"

ఆ వాస్తవం ఏమిటో అతడికి బోధపడలేదు. అతడు ఆలోచిస్తుండగానే ఆమె..

"చెప్పలేదు. ఏవిఁటి తింటున్నావు? బాగుంటుందా? అంది.

"అయ్యో! ఏదోలెండి. మీవంటివారు తినేది కాదు." అతడు బాగా నొచ్చుకున్నాడు.

"మేం పెద్ద పెద్ద హోటళ్ళలో తింటామనా? గడ్డి అంతా. స్పూన్లు, ఫోర్కులతో తింటుంటాము. భారతీయ సంప్రదాయాల్నే మరచిపోతున్నాము...

ఆమె మళ్ళా వాచీ చూసుకుంది. తరువాత రోడ్డు మీద వాహనాల కేసి చూసింది. ఆమె ముఖంలో ఏదో విసుగు కనిపించింది.

"చెప్పు మరి!"

"సేమ్యా పులిహోరండి."

"బాగుంటుందా? రుచిగా వుంటుందా?" ఆమె మాటల్లో మాత్రం విసుగుదల లేదు.

"ఏదో లెండి."

"రుచిగానే వుంటుంది. అందులో మీ కపటం లేని ప్రేమలు, ఆప్యాయతలు, అనుబంధాలు కలిసి వుంటాయి."

ఆమె మాటల్లో జీవితంలో ఏదో పోగొట్టుకున్న ధ్వని వినిపించింది.

అతడు ఆశ్చర్యపోయాడు.

అయినా కొంచెం ఉత్తేజితుడై

"తింటారా?" అనడిగాడు.

"తిందావనే వుంది. కాని నువ్వు మళ్ళా అక్కడకు...."

"ఎంతసేపండి. అయిదు నిమిషాలు..." అతడు మరేమీ వినిపించుకోకుండా పరుగులాంటి నడకతో పార్కు బయటకు వెళ్ళిపోయాడు.

అన్నట్లుగానే అయిదు నిమిషాల్లో వచ్చాడు. చేతిలో కాగితం పొట్లం వుంది. పొట్లం లోపలి నుండి అరిటాకు కొన బయటకు తొంగి చూస్తుంది.

ఆమె కొంచెం నొచ్చుకుంది.

"అయ్యో! నేను చెప్పేది వినిపించుకోకుండా పరుగు పరుగున పోయావు.."

అతడు కొంచెం వగర్పును అణచుకుంటూ

"తినండి..." అన్నాడు. జేబులోంచి ఒక వాటర్ ప్యాకెట్‌ను కూడా బయటకు తీశాడు.

ఆమె సేమ్యా పొట్లం కేసి, వాటర్ ప్యాకెట్ కేసి విచిత్రంగా చూసింది.

"అక్కడ పెట్టు" అంది.

అతడు ఆమె చూపిన చోట కుర్చీలో పెట్టాడు వాటిని.

ఆమె మాటి మాటికీ వాచీ కేసి చూసుకుంటూ వుంది. తినే ప్రయత్నమేమీ చేయడం లేదు. ఎవరి కోసమో ఎదురు చూస్తూ వుందా?

అంతలో ఒక పొడవైన తెల్లని వ్యక్తి రాయల్ బ్లూ ఫుల్‌సూట్‌లో ఆమె వైపు నడుచుకుంటూ వచ్చాడు.

ఆమె లేచి నిలబడింది.

"ఇంతసేపా! నియర్లీ టూ అవర్స్!"... అంటూ ఆమె చిరుకోపాన్ని ప్రదర్శించింది.

"వెళ్ళి రావాలిగా. థర్టీ కిలోమీటర్స్ అటూ యిటూ. సైటుకు ఇంజనీర్ను రప్పించడం ఆలస్యమైంది. ప్లంబింగ్ ప్రాబ్లమ్స్ ఏవో వచ్చాయి. ఎలక్ట్రిఫికేషన్ అవుతూ వుంది. రెండు నెలలు పట్టొచ్చు. ఈలోగా మన యు.ఎస్. ట్రిప్ అయిపోతుంది. ఫ్లాట్స్ చాలా మట్టుకు బుక్ అయిపోయాయి. రెండు డూప్లెక్స్‌లు మాత్రం మిగిలాయి. నిన్ననే జిజిహెచ్ డాక్టర్లిద్దరు అడిగారు. వాళ్ళకిచ్చేద్దామని వుంది. తిరిగి వచ్చాకా అన్నీ పూర్తి చేద్దాం."

"పిల్లల్నీ, మనవల్నీ చూసేదాకా మనసు నిలవడం లేదు" అందామె.

"అందుకేగా అర్జంటుగా యు.ఎస్.ఎ. బయలుదేరదీశావు." ఎల్లుండి సాయంత్రానికి అక్కడుంటాములే. హైదరాబాద్‌లో రేపు ఉదయం ఫ్లయిట్ ఎక్కడమే కదా" అన్నాడతడు.

"అతనెవరు?" అడిగాడు అతడే.

"అతనా... దేవీ అని... దేవీప్రసాద్... నాతో అమలాపురంలో ఎస్సెల్సీ చదివాడు.." ఆమె 'హ్హి హ్హి!' అని నవ్వింది.

భార్యాభర్తలిద్దరూ పార్కు బయటకు నడిచారు.

అతడికేం చేయాలో కొన్ని క్షణాలు అర్థం కాలేదు. కూడా నడవాలా?

వాళ్ళు పార్కు బైటనున్న తమ కారు వద్దకు చేరుకున్నారు.

అతడు కుర్చీలో వుంచిన సేమ్యా పొట్లాన్నీ, వాటర్ ప్యాకెట్టునూ పట్టుకొని విమూఢుడిలా వారి వెనకనే నడిచి కారు వద్దకు చేరాడు.



వాళ్ళు అప్పటికే కారులో కూర్చున్నారు.

"అలా వున్నాడేవింటి? బెగ్గర్లా! అతడితో మాటలేవింటి?" ఆమె భర్త నవ్వుతూ గట్టిగానే అన్నాడు.

"ఏదో కాలక్షేపం. వాళ్ళ ప్రేమలు, ఆప్యాయతలు.."

ఈసారి ఆమె యింకా పెద్దగా 'హ్హి హ్హి!' అని నవ్వింది.

"నీ ఫ్రెండ్స్‌లో ఇలాంటి వాళ్ళు కూడా వున్నారన్న మాట. భర్త 'హ్హ హ్హ!' అని నవ్వాడు.

కారు ముందుకు కదిలింది.

అవమానంతో, సిగ్గుతో అతడు అలాగే నిలబడిపోయాడు.

ముందుకు వెళ్ళిన కారు కీచుమంటూ సడెన్ బ్రేకు పడి ఆగింది.

ఆమె భర్త డ్రైవింగ్ సీటులోంచి వెనక్కు అతడి వైపు తల తిప్పి దగ్గరకు రమ్మంటూ చెయ్యి వూపాడు.

అయిష్టంగానే అతడి కాళ్ళు కారు వద్దకు నడిచాయి.

"తీసుకో" అన్నాడామె భర్త రెండు వంద రూపాయల కాగితాలిస్తూ.

అతడు ఆశ్చర్యపోయాడు. తెల్లబోయాడు. వెర్రి చూపులు చూశాడు.

"దేవీ! తీస్కో ఫర్లేదు" అంది ఇందుమతి కారులోంచి.

అతడి చేతిలో బలవంతంగా కాగితాల నుంచి కారును పరుగులు తీయించాడామె భర్త.

పూర్తిగా చీకటి పడిపోయింది. రోడ్డంతా ఎడతెరపి లేని ట్రాఫిక్‌తో, కళ్ళు మిరమిట్లు గొలిపే లైట్లతో, హారన్ల మోతల్తో, మనుషుల అరుపులు, కేకలతో అతడికి తల బద్దలైపోయేలా వుంది.

చేతిలో వంద రూపాయల కాగితాలు రెపరెపలాడుతుంటే అంత జన సమ్మర్ధంలోనూ రాత్రివేళ దెబ్బతిన్న ఒంటరిపక్షిలా నిలబడిపోయాడతడు.

"బాబూ! ధర్మం బాబూ! ధర్మం చెయ్యండి బాబూ!"

పక్కకు చూస్తే నేలబారు చక్రాల బండి మీద ఒక వ్యక్తిని కూర్చుండబెట్టి తాడుతో బండిని లాగుతున్న కుష్టు వ్యాధిగ్రస్తురాలు ఒకామె కనబడింది. బండి మీద కూర్చున్నదీ కుష్టు రోగే. భర్త అయి వుంటాడు. అతడికి ఒక కాలు కూడా లేదు.

అతడు ఆలోచించకుండా వంద రూపాయల నోట్లను ఆమె చేతిలో పెట్టాడు. ఆమె కళ్ళలోని ఆశ్చర్యాన్నీ, భయాన్నీ గమనించనట్లుగా పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ తన ఇంటి దిక్కుగా ముందుకు సాగిపోయాడు.

అతడు చేతిలోని సేమ్యా పొట్లాన్ని తనకు తెలియకుండానే గట్టిగా నొక్కుతున్నట్లు గ్రహించాడు. నెలాఖరు రోజులు. జేబులో వున్న ఆఖరు అయిదు రూపాయలలో నాలుగు రూపాయలు సేమ్యా పులిహోర కోసం, ఒక రూపాయి వాటర్ ప్యాకెట్ కోసం ఇచ్చాడు. ఇంటి దగ్గర మనవరాలి కోసం రోజూ ఏదైనా కొని పట్టుకెళ్ళడానికి ఎప్పుడూ తను వెనుకా ముందు చూసుకోవడం అతడికి గుర్తుకొచ్చింది. అతడి హృదయం బాధగా మూలిగింది. ఎప్పుడో సేమ్యా పులిహోర గురించి ఇంట్లో చెబుతుంటే మనవరాలు అడిగింది తెచ్చిపెట్టమని. అతడు పొట్లాన్ని ఆప్యాయంగా నిమిరాడు. ఒక కన్నీటి బొట్టు పొట్లం మీద రాలింది. గబగబా చొక్కా అంచుతో దాన్ని తుడిచేశాడు.

ఆ పొట్లంలో సేమ్యాతో పాటుగా, ఒక పేద కుటుంబానికి మనుషుల పట్ల గల ప్రేమ, నమ్మకం కూడా వున్నాయనిపించిందతడికి.

అతడు మనసులోంచి అంతా తుడిచేశాడు. చిన్న ముద్దు మోముతో తన కోసమే గుమ్మం దగ్గర ఎదురుచూసే చిన్నారి మనవరాలు అతడి మనసంతా ఆక్రమించుకుంది.

■



# ఓపెన్‌కాస్ట్ జీవితాలు

- మేడవరం క్రాంతికుమార్
సెల్ : 99481 25268

పచ్చని పొలాల్ని , పాడి పంటలను, మానవత్వపు పరిమళాల్ని
తనలో ఇముడ్చుకున్న ఓపెన్ కాస్ట్‌లు, రైతుల గుండెల్లో
బాంబుల్లా పేలుతున్నాయి
ఉన్న భూమిని లాక్కొని ఓ చిరుద్యోగాన్ని ప్రసాదించాయి
జీవితంలో మార్పులు కొండచిలువలా పెనవేసుకున్నాయి
చిగురాకుపచ్చ పొలాలు నల్లని రాక్షస బొగ్గు కుప్పలయ్యాయి
యిల్లు నల్లబారిపోయాయి
శరీరంలోకి కొత్త రోగాలు చొచ్చుకొని వచ్చాయి
రోజంతా పని, తీరికలేని పని
ఊపిరితిత్తులలోకి చేరిన నల్లని బొగ్గు దుమ్ము
జీవితంలోని తడిని ఆవిరిచేసి
ఎండిపోయిన భారమైన నిర్జీవత్వాన్ని మిగిల్చాయి
పేదరికం నల్లని చీకట్లుగా జీవితాన్ని ఆవరించింది
అర్ధరాత్రులు గుండెలదిరేలా పేలుళ్ళు
పౌర్ణమి వెన్నెల సైతం నల్లగా కమిలిపోతున్నవేళ
ముక్కురంధ్రాల గుండా చొచ్చుకెళ్ళే బొగ్గు ధూళి
శ్వాసకోశాల్ని, గుండె నాళాల్ని నింపుకుంటూ
బతికుండగానే జీవశ్చవాలుగా మారుస్తున్న పరిస్థితి
ముసలి జీవితాలు పొలం పనిలేక, కాళ్ళను చెప్పుల్లో దూర్చుకొని
పిచ్చివాళ్ళల్లా బొగ్గు దిబ్బలు చుట్టూ తిరుగుతుంటారు
బతికున్న శవాలు ఆ ఊళ్ళల్లో జీవితాల్ని భారంగా ఈడుస్తుంటాయి
భూమి మీద తనకేమి పనిలేనట్లు తియ్యని ఎండ్రిన్ చుక్కల కోసం
అర్రులు చాస్తున్న ఎర్రటి నాలుకలు
గానుగకు ఎద్దుని కట్టేసినట్లు వాళ్ళ జీవితాల్ని
భూమి నుండి వేరు చేసి ఆ బొగ్గుకి కట్టేశారు
చచ్చేంతవరకు అటే తిరిగి ఆ బొగ్గ గుట్టల్లోనే శిథిలమవ్వాల
ఏ కుటుంబంలోను రెండు ప్రాణుల మధ్య మాటలు పెగలటం లేదు
ఒకప్పుడు భూమి వాళ్ళందరిని ఒకే దారానికి గుచ్చిన పూలమల్లే
కలిపి వుంచేది. నాట్లకు, కోతకు, మళ్ళీ దున్నుకు నిరంతరం
వాళ్ళ మధ్య మాటల ప్రవాహం ఇంకిపోకుండా పారేది
వాళ్ళందరికి కుదురునిచ్చే శక్తి అదృశ్యమయ్యింది
మాట్లాడితే విధ్వంసాన్ని, జరగబోయే భవిష్యత్తు అంధకారాన్ని
ఒలకబోసుకోలేక ఆ భారాన్ని గుండెల్లోనే మోసుకుంటూ
ఆ కళ్ళలో చావుకోసం ఎదురుచూస్తున్నారు
పదిరోజులకొక బలవన్మరణం బతికున్నవారిని భయపెట్టడం మానేసింది
ఇల్లు, పొలాలు, ఊళ్ళు వదిలి వలసెళ్ళే ధైర్యంలేక
ఆ జీవితాలను బొగ్గు చుట్టే చుట్టేసుకున్నారు
అక్కడ రాలిపోయే ఎండుటాకులు తప్ప
చిగురించే పచ్చని ఆకులు కానరావు

---

# ఐదో వర్ణం

- గోరుగంతుల రాజశేఖర్

అమ్మకు అయిదో వాడిగా
పుట్టినందుకు
వాడిని కోవెల రావద్దంది
బడి బయట కూర్చోబెట్టింది
మడి గట్టిన బ్రాహ్మణ్యం
కంటపడద్దని కట్టడి చేసింది
వర్ణ వివక్ష కుంగదీసింది
వాడు.. మానవత్వం లేని నేలలో
మట్టి మనిషిగా తిరుగాడాడు
వాడి ఒళ్ళు
దాస్యానికి దస్థతై
శ్రమైక జీవనానికి చిహ్నమయ్యింది



పాదరక్షై అధికారం కాళ్ళను కాపాడింది
నాగలై నోటికి ముద్దనిచ్చింది
నాలుగు కాళ్ళ తొక్కిడి వాడి ఆలోచనను అణిచివేసింది
కానీ...
కాలం నదిలో వాడి ఆవేశాల వెల్లువ పోటెత్తింది
ఆధిపత్యపు హోరు ఆగింది
వాడిలోని విద్యాగంధం పరిమళించింది
కులం గోడల్ని బద్దలు గొట్టడానికి ఉద్యమమయ్యింది
సమానత్వాన్ని ఆకాంక్షించింది, మానవత్వాన్ని మేలుకొల్పింది
ఇప్పుడు వాడి చిరునామా
అంటరానివాడు కాదు
అన్నింటా వున్నవాడు!
అదిగో నా పతాకం ఐదో రంగుని కలుపుకుని
హాయిగా ఎగురుతోంది

## హిందీ సాహిత్యకారులు

# పేదల కవి 'అదమ్ గోండ్వి'

- గీతా శాంత్


అదమ్ గోండవి

మీరు రాగలరు ఎప్పుడైనా గ్రామాల్లో పూరిళ్ళకు, నేనున్నా లేకున్నా, ఆకలి మీకు స్వాగతం పలుకుతుంది... ఈ వాక్యాలు రాసింది పీడిత ప్రజల కవి రామ్‌నాథ్ సింహ్ ఉరఫ్ 'అదమ్ గోండ్వి'.

ఆకలి నీడలోనే జీవితాన్ని గడిపిన అదమ్ గోండ్వి తగు వైద్యం అందక మృత్యువుని వరించారు. ఆయన మరణానికి స్పందిస్తూ కవి మునవ్వర్ రానా 'అడిగితే పద్మశ్రీ దొరుకుతుంది, అడగకపోతే చికిత్స కూడా దొరకదు' అన్న మాటలు సబబే అనిపిస్తాయి. ఆయన అడుక్కునే వాళ్ళ కోవకు చెందదు. అందుకే లివర్ సిరోసిస్‌తో బాధపడుతున్న 'అదమ్ సాహెబ్'కు డబ్బులేని కారణంగా సరియైన చికిత్స అందలేదు. జీవిత తుది శ్వాస నాటికి ఆయనపై రూ. 3 లక్షల అప్పు, స్థలం తాకట్టులో వుంది.

స్వాతంత్ర్యం వచ్చిన తొలి రోజుల్లో 22 అక్టోబర్, 1947న ఉత్తరప్రదేశ్, గోండా జిల్లాలో ఆటా పరసపుర్ అనే గ్రామంలో ఆయన జన్మించారు. చనిపోయేటప్పటికి 64 సంవత్సరాల స్వాతంత్ర్య దేశంలో ఆయన గడించిన అనుభవం, జమీర్ (మానం) కాపాడుకోవటం కోసం జమీన్ (స్థలం) పోగొట్టుకోవడం.

మామూలుగా కూడా స్వతంత్ర భారత ముఖచిత్రాన్ని ఆయన చూసిన కోణం గురించి అందరిని అడుగుతూనే వున్నాడు...

"నూటికి డెబ్బై మంది ప్రస్తుతానికి (నాశాద్) కష్టాల్లో ఉన్నారు. గుండె మీద చేయివేసి చెప్పండి దేశం (ఆజాద్) స్వతంత్రమేనా?"

ఆయన స్వయంగా నాశాద్‌గా (కష్టాల్లో) ఉండి 'నాశాద్' ప్రజల గొంతై నిలిచాడు. స్వాతంత్ర్యం కోసం సాధారణ ప్రజల పోరాటం, అమరవీరుల త్యాగాలు బూడిదపాలవటం చూసి ఆయన మనసు కలత చెంది ఘోషించింది..

"ఎవరనుకున్నారు, వెలుతురుకి వయసొచ్చినపుడు
నిన్నటి మసిబారిన చీకట్లనే వరిస్తుందని"

ఆయన కవన కృతులను చదువుతున్నపుడు పాఠకులకు ఫైజ్, దుష్యంత్‌కుమార్, నాగార్జున్, ముక్తిబోధ, ధూమిల్ వంటి వారి వారసత్వాన్ని అదమ్ గోండవి పుణికిపుచ్చుకున్నారని ఇట్టే అర్థమైపోతుంది. ఆయన అంటూ ఉండేవాడు...

"ఆకలి మంటల్ని కావ్య రసానుభూతి వరకు తీసుకెళ్ళు
లేదా మర్యాదలు లేనివాళ్ళ ఇంటి వరకు తీసుకెళ్ళు"

పల్లెటూరులో ప్రాథమిక పాఠశాల వరకే చదువుకున్న అదమ్ సాహెబ్‌కి జీవిత సత్యాలు ఎలాంటి పాఠాలు నేర్పాయంటే ఎటువంటి కాల్పనికతైనా ఆయనకు నచ్చేది కాదు. కవితలో ప్రేమ (రొమాన్స్) కలాపాలను పూర్తిగా విడిచిపెట్టమని ఆయన చెప్పుండేవాడు...

"తేమగిల్లిన పెదాల వేడి ఇవ్వలేదు ఉపశమనం
పొట్ట భూగోళంలో చిక్కుకుపోయిన మనిషికి"

సంపాదన కోసం రాసే కవులు, కవితలపై ఆయన విరుచుకు పడిన తీరు

"ఒళ్ళేమిటి, మనసు కూడా అంతే స్పష్టంగా చూడండి.
మీరు కూడా ఈ రొంపిలో పడి తమాషా చూడండి.
అడుగంటుతోంది దేశం, వీరు బుజ్జగిస్తున్నారు జాతిని.
ఎంత అశ్లీలంగా మారిందో కావ్య భాషని చూడండి"

ఆయన వ్యక్తిత్వంలో ప్రత్యేకత ఏమంటే ఆయన పూర్తిగా నిజాయితీపరుడు, సత్యానికి కట్టుబడి వున్నవాడు. ఆయన కవితలు ఎన్నోసార్లు పార్లమెంటులో కూడా ప్రతిధ్వనించాయి. అదమ్ గోండ్వి జీవితాంతం మరవని విషయం ఏమంటే,

"చింకి బట్టలతో ఒళ్ళు కప్పుకుని
ఎక్కడైనా ఎవరైనా వెళుతూ వుంటే"
ఆ దారి అదమ్ గ్రామానికి వెళుతుందని అనుకోండి..."

ఆయన పల్లెలో పుట్టి జీవితాంతం పల్లెలోనే గడిపారు. ఆయనకి గ్రామం ఎంత ఇష్టమంటే ఒకవేళ పట్టణం వెళ్ళినా త్వరగా తిరిగి గ్రామానికి వెళ్ళాలనే ఆత్రుత ఉండేది. తనలాంటి కవి గ్రామాన్ని విడిచిపెట్టి పట్టణంలో స్థిరపడాలని ఆయనకు ఎప్పుడూ అనిపించలేదు. ఆయన ఇంకా ఇలా చెప్పాడు.

"గజల్‌ని తీసుకుపోండి ఇహ పల్లెసీమల చిత్తాకర్షక

దృశ్యాలలోకి

ఈ కృత్రిమ మర్యాదల ఊబిలో సహజ శిల్పం

కొట్టుకుంటోంది ఊపిరాడక"

ప్రభుత్వాలు గ్రామాల అభివృద్ధి గురించి కట్టుకథలు చెప్పినపుడు అదమ్ సాహెబ్ మండిపడేవాడు. పల్లెల ఖాళీ గిన్నెల వ్యధను క్రోడీకరించి ఆయన వ్యవస్థను ఈ విధంగా సవాలు చేశాడు.

"మీ ఫైళ్ళలో గ్రామాల వాతావరణం పచ్చగా ఉంది

కాని గణాంకాలు అబద్ధం, వక్కాణింపు కాగితాలకే పరిమితం

మీ టేబుళ్ళు వెండివి, మీ పెగ్గులు బంగారం

ఇక్కడ జుమ్మన్ ఇంట్లో

పగిలిన పళ్ళెం"

తెల్లటి పంచె చొక్కాలో చుట్టబడిన ఆయన బక్కపలచని శరీరం నుండి నిప్పులు చెరిగినపుడు అధికార వసారాలు చప్పుడు లేకుండా పోయేవి.

"డల్‌హౌసి చేయలేనిది ఈ తాబేదార్లు చేసేస్తారు. కమిషన్ ఇస్తే దేశాన్నే వేలం పాడేస్తారు. ఉదయం లేచి వీరు వందేమాతరమ్ ఆలపిస్తారు. కాని అంగట్లో సరుకుల వెల రెట్టింపు చేసేస్తారు."

నిరాడంబరతలతో పాటు ఆయన వెరవని సాహసం గల అద్భుత మూర్తి. సఫ్దర్ హష్మి బాహాటంగానే హత్య గావింపబడినపుడు ఆయనకు శ్రద్ధాంజలి ఘటించడానికి నిర్వహించబడ్డ కవి సమ్మేళనంలో ఈ విధంగా స్పందించడం అదమ్ గోండవీకే చెల్లింది.

"ప్లేట్లో వేయించిన జీడిపప్పు, విస్కీ గ్లాసులో రామరాజ్యం దిగి వచ్చింది. ప్రజా ప్రతినిధి నివాసంలో ప్రజలకు ఉన్నది ఒకటే మార్గం 'తిరుగుబాటు'. ఈ మాట నేను చెబుతున్నాను పూర్తి స్పృహలో..."

ఎప్పుడు పల్లెలో ఉన్నా అదమ్ గోండవికి రాజకీయాలు, పాలనా యంత్రాంగ అవినీతి, ముప్పుతిప్పలు పెట్టే సూక్ష్మాలు గురించి బాగా తెలుసు. దీనిపై ఆయన కటూక్తి

"వట్టి జీతంతో ఎలా తీర్చాలి భార్య లుకలుకలు / వెయ్యి దార్లున్నాయి / సిన్హా సాహెబ్ ఆదాయానికి శ్రీమతి సిన్హా చేతుల్లో ఏ సందర్భం లేకుండా ఘల్లుమంటున్నవి / గత వరదల కానుకలు / ఆ మోచేతి గాజులు."

ప్రభుత్వ పథకాల బండారం కూడా ఆయన ఈ విధంగా బయట పెట్టాడు.

"చిక్కుకుపోయింది ఫైళ్ళ వలలో

ఎన్ని సంవత్సరాల్లో పల్లెకు వస్తుందో వెలుతురు"

ఆర్థిక, రాజకీయాంశాలతో పాటు సామాజిక విషయాలు కూడా అదమ్ సాహెబ్ కలానికి వస్తువులైనాయి. మతతత్వానికి వ్యతిరేకంగా ప్రజలను చైతన్యపరుస్తూ ఆయన అంటాడు...

"మనలోనే ఒకరు హూణ్, ఒకరు శక, ఒకరు మంగోల్ / పాతుకుపోయిన మాట అది / దాన్ని మరి కెలకవద్దు / కలసి మెలసి యుద్ధం ప్రకటించండి పేదరికంపై / నా నేస్తం / మతపరమైన పాటలు ఆలపించవద్దు.

యువతను మొదట భ్రష్టు పట్టించి, ఆ తరువాత నైరాశ్యంలోకి నెట్టే ఈ వ్యవస్థపై ఆయన ఆక్రోశం ఇలా వ్యక్తమయింది...

"ఈ వ్యవస్థ కొత్త తరానికి ఒరగబెట్టేదేవిటి?

సెక్స్ రంగుల వల, సల్ఫాస్ గుళికలు..."

అదమ్ గోండ్వి నిప్పుల చెరిగే పదాలతో భావ వ్యక్తీకరణ మాత్రమే కాకుండా అన్యాయానికి వ్యతిరేకంగా, పోరాటానికి ఆయుధంగా మలచాడు. 1973లో ఆయన రాసిన దీర్ఘ కవిత 'చమారోం కీ గలి' (గోదారి వాళ్ళ వీధి) లో హరఖూ అనే దళితుడి కూతురు గ్రామంలో పెత్తందార్ల ద్వారా జరిగిన దురాచారాన్ని ఎంత సంవేదనాత్మకంగా చెప్పాడంటే ఆ కవిత రైతులపై జరిగే దోపిడీకి వ్యతిరేకంగా ఒక ఉద్యమంగా రూపుదాల్చింది. బి.బి.సి. లండన్ కూడా తన హిందీ కార్యక్రమంలో ఈ కవితని ప్రసారం చేసింది. ఈ కవిత ప్రజాదరణ వల్ల నేరం చేసిన వారికి శిక్ష పడింది. అదమ్ గోండవి రాసిన ఈ చారిత్రాత్మక కవిత ఇలా మొదలవుతుంది...

రండి జీవిత తాపం అనుభూతి పొందండి

నేను గోదారి వాళ్ళ వీధి వరకు తీసుకెళతాను మిమ్మల్ని...

తన పదాల సామర్థ్యం, వాటి ప్రభావం గురించి పూర్తి అవగాహన ఆయనకు ఉంది. దోపిడీదార్లకు భయం గొల్పించే విధంగా ఆయన వ్యక్తిత్వం మారిపోయిందని ఆయనకు బాగా తెలుసు. అందుకే ఆయన సరదాగా ఇలా చెప్పాడు...

"నేను మర్యాదగా చేయెత్తాను సలామ్‌కి

వారనుకున్నారు దీనిలో ప్రమాదముంది దొరలకి"

దోపిడీ చేసే దొరలకి ప్రమాదంగా మారిన ఈ గొంతు మూగబోయింది గాని అదమ్ గోండ్వి లాంటి వారికి చావు అనేది ఉందా? అది ప్రజా సాహిత్యమనే తోటలో అద్భుతమైన పువ్వుపరిమళం ఎల్లకాలం గాలిలో కలిసిపోయి ఉంటుంది. ఎప్పుడూ కూడా అన్యాయానికి వ్యతిరేకంగా ప్రజలు పోరాడుతున్నప్పుడు "కష్టాల్లో ఉన్నవారి" వారి చేయితో ఈ కవి చేయి కలిసే ఉంటుంది.

**అనువాదం : వేదుల రామకృష్ణ**

# ఒక సన్నివేశం

- వడలి రాధాకృష్ణ
సెల్ : 9985336444



అలుపెరుగని శ్రామిక శకటం
పట్టాలపై పహారా చేస్తూనే వుంది!
రాత్రి తాలూకు చిట్టచివరి చీకటి చెలమ
ఛేదింపబడుతూన్న క్షణాన
ప్రభాతానికి రేఖామాతృకగా
ఒక కాల్పనిక సన్నివేశం వెలుగు చూస్తోంది
ప్రాప్తకాలజ్ఞతన నిరంతరమైన
ఆ రైలు ప్రయాణం అనివార్యమవుతూనే వుంది
అతిశయం లేని అభినవేశాన
అది బహుదూరపు బాటసారి మరి
వచ్చి వాలిన క్షణాన స్టేషను
చైతన్యానికి చిరునామా అవుతోంది
రిక్షాలు దిగిన తర్వాత ఉరుకులు..
స్కూటరు పార్కు చేసినప్పటి పరుగులు..
ఓ సహేతుక దృశ్య కావ్యం ఆవిష్కృతమవుతోంది
పాసింజరు రైళ్ళు తనను
స్వాగతిస్తూ ప్రక్కకు జరుగుతున్నాయి
బుకింగ్ కౌంటర్ దగ్గర... ఎనౌన్స్‌మెంట్‌లోను
ఉద్యుక్తం గాని ఉత్సాహం ప్రోది అవుతోంది
చద్దిమూట చేతబట్టి పొలం పనులకు వెళుతూన్న కూలన్న
భుజాన సంచితో విధి నిర్వహణకంటూన్న ఉద్యోగిని
చేత పుస్తకాలతో రేపటి ప్రపంచానికి తర్ఫీదుగా విద్యార్థి
కన్నతల్లిలా అది అందర్నీ కడుపులో దాచుకుంటోంది
ప్లాట్‌ఫాం నిండా సందడే సందడి
కేరింతలు... కోలాహలాలు..
జాతి మనోముద్రలు ఆవిష్కృతమవుతున్నాయి
బయట గుంభనంగా ఉన్న మనిషి... మానవత్వం
ఇక్కడ మనసు విప్పి పలకరించుకుంటున్నాయి
కాలం పురివిప్పిన మయూరమవుతోంది
కిటకిటలాడుతూన్న చైతన్య శకటం
గమ్యం వైపు పునరంకితమవుతోంది
మల్లెపూల మణెమ్మ... సమోసాల సరయ్య బుట్టలతో
కిక్కిరిసిన మనుషుల మధ్యలోకి చొచ్చుకుపోతూంటే
చిరువ్యాపారాల సరాగాలు విన్పిస్తున్నాయి
యానం నిరంతరమే అయినా రోజుకో అనుభూతి... అనుభవం
రైలు సాగి పొలిమేర దాటిపోతోంది
మిగిలిన పట్టణం బోసిపోయి ఉంది
ఊరుని తెలియని నైరాశ్యం ఆవహించేస్తోంది
చైతన్యం చెమ్మగిల్లిన మట్టిబొమ్మ అవుతోంది
అది సంచార జీవుల నిష్క్రమణ తర్వాత
ఏర్పడ్డ అగాధంలా ఉంది
ఇప్పుడు మాటలు లేవు...మమతల అచ్ఛాదనలు లేవు
ఊరిలో కాలం యాంత్రికమయిపోతోంది.
గాలి ఛేదనలో వెలుతురు స్తంభించినట్లుంది
పగటి వెలుతురుని చీకటి మింగేసినట్లుంది
ఆశల ఆరాటాన జీవనయానం చేస్తున్న వారిలో
అమెరికా కెగిరి డాలర్ల సంపదతో
దేశాన్ని పరిపుష్టం చేస్తూన్న
మా ఊరి మొనగాళ్ళు అగుపిస్తున్నారు
మరల చీకటి నిత్యకృత్యమవుతోంది
అందర్నీ అక్కున జేర్చుకొని తిరిగి వచ్చిన
ఆ రైలు నిండు గర్భిణిలా అన్పిస్తోంది
దానిలో మచ్చుకైనా కానరాని అలసట
మరల స్టేషన్‌లో అదే కోలాహలం... చైతన్యం
బరువు తగ్గించుకొని వీడ్కోలు పలుకుతోంది
తనవారిని వదలలేక భారంగా బయలుదేరుతోంది
బోసిపోయిన ఊరిలో చైతన్యం వెల్లివిరుస్తోంది
వచ్చిన వారిని ఆర్తితో ఊరు అక్కున జేర్చుకుంటోంది
ఇప్పుడు సాయం సంధ్యలోను వెలుతురు స్పర్శ
మానవీయ సన్నివేశానికి మహత్తర నిర్వచనమవుతూ...!

**(ప్రతి నిత్యం మా చీరాల నుండి పినాకిని ఎక్స్‌ప్రెస్‌లో ఉదయం వెళ్ళి రాత్రికి ఇంటికి చేరుకొనే వందలాది సంచారజీవులు మనో చిత్రానికి అక్షర రూపం)**

# ఛాయాచిత్రాలతో చరిత్ర నమోదు

**- గుడిపూడి విజయరావు**


సునీల్ జనా (1918-2012)

రాష్ట్ర మహిళా ఉద్యమ నిర్మాతల్లో ఒకరైన మోటూరు ఉదయం మరో ఇద్దరుతో కలిసి బుర్రకథ చెబుతున్న చిత్రం మహిళాసంఘం కార్యాలయంలో మనకు స్వాగతం పలుకుతుంది. ఆ చిత్రానికి మూలమైన ఫోటోను తీసింది సునీల్ జనా. తెలంగాణా పోరాటయోధురాలు ఇతర మహిళా గెరిల్లాలతో కలిసి తుపాకి పట్టిన ఫోటో కూడ చిరపరిచితమైందే. దాన్ని తీసిందీ ఈయనే. 1940వ దశకం భారత దేశచరిత్రలో అత్యంత సంచలనాత్మకమైనది. బ్రిటిష్‌వారినుండి స్వాతంత్ర్యం పొందడం, అంతకు ముందు ఆ తర్వాత జరిగిన అనేక ప్రజాపోరాటాలు, దారుణ మతకొట్లాటలు, భయంకరమైన కరువు కాటకాలు- ఈ చరిత్రనంతా తన ఫోటోలద్వారా శాశ్వతంగా నమోదుచేశారు సునీల్ జనా. దీనికి కారణభూతమైంది ఆనాటి కమ్యూనిస్టుపార్టీ. కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యంలోనే ఆయన ఈ కర్తవ్యాన్ని నిర్వహించారు. ఒక ఫోటోగ్రాఫర్‌గా అలాంటి చెరగని ముద్రవేసుకున్న సునీల్ జనా 2012 జూన్ 21న 96 ఏళ్ల పండువయసులో అమెరికాలో కన్నుమూశారు.

సునీల్ జనా 1918 ఏప్రిల్ 17న అస్సాంలోని దిబ్రూగర్‌లో మాతామహుల ఇంట్లో జన్మించారు. ఆయన తల్లిదండ్రులు శరత్ చంద్ర జనా, ప్రమీల బాల రాయ్ జనా. శరత్‌చంద్ర కలకత్తాలో పేరుమోసిన లాయరు. వారి స్వస్థలం మిద్నపూర్ జిల్లాలో ఉంది. సునీల్ జనా కలకత్తాలోని సెయింట్ జేవియర్, ప్రెసిడెన్సీ కళాశాలల్లో చదివారు. 1942-43 నాటికి జనా ఇంగ్లీషు లిటరేచర్‌లో ఎంఏ చేస్తున్నారు. లా డిగ్రీ కోసం కూడ చదువుతున్నారు. చదువుతో సమాంతరంగా ఫోటోగ్రఫీలో కూడ ఆసక్తిని ఆయన కొనసాగించాడు. చిన్ననాటినుండీ ఫోటోగ్రఫీ అంటే తెగ అభిమానం. ఓ పద్ధతి ప్రకారం ఫోటోగ్రఫీలో శిక్షణపొందనప్పటికీ, వృత్తి ఫోటోగ్రాఫర్లవద్ద మెళకువలు నేర్చుకున్నాడు. ఆ తర్వాత తన జీవితమే ఫోటోగ్రఫీగా మారినా ఆయన ఏ ఫోటోగ్రఫీ సొసైటీలోనూ సభ్యునిగా చేరలేదు.

వామపక్షరాజకీయాలపట్ల, ప్రజాఉద్యమాల పట్ల ఆకర్షితులైన సునీల్ జనా, ప్రెసిడెన్సీ కాలేజీలో ఉండగానే విద్యార్థి ఫెడరేషన్‌లో చేరి చురుకైన పాత్ర వహించారు. ఫోటోగ్రఫీ హాబీగా కలిగిన ఆయన పార్టీ కార్యకలాపాలను ఫోటోలు తీస్తుండేవారు. అవి ప్రచురితవుతుండేవి కూడ. అయినా ఆయన ఎప్పుడూ ఓ ఫోటోగ్రాఫర్ కావాలని కోరుకోలేదు. జర్నలిస్టు కావాలన్నది ఆయన కోరిక. ఎంఏ పూర్తిచేసి ఇంగ్లీషు ప్రొఫెసర్ కావాలని కూడ అనుకునేవారు. సరిగ్గా ఈ సమయంలోనే ఆయన జీవితంలో ఒక మూలమలుపు చోటుచేసుకుంది. సునీల్ జనా ఫోటోలను చూసి, ఆ పనిలో ఆయన నైపుణ్యాన్ని పసిగట్టిన ఆనాటి కమ్యూనిస్టు పార్టీ నేత పిసి జోషి స్వయంగా ఆయనను కలుసుకున్నారు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం జరుగుతున్న ఆ రోజుల్లో, బెంగాల్‌లో భయంకర క్షామం కొనసాగుతున్నది. బెంగాల్‌లో పర్యటించి ఆ క్షామం గురించి తాను కథనాలు రాస్తానని, వాటికి ఫోటోలు సునీల్ జనా తీయాలని జోషి కోరారు. ఆనాటి పార్టీ పత్రిక పీపుల్స్ వార్‌లో బెంగాల్ కరువుపై జోషి కథనం, సునీల్ జనా ఫోటోలు వరుసగా ప్రచురితమయ్యాయి. ఆ విధంగా జనా ఆరు





దశాబ్దాల ఫోటోగ్రఫీ ప్రస్థానం మొదలయింది.

ఒక్క బెంగాల్‌లోనే 20 లక్షల మందిని పొట్టన పెట్టుకున్న ఆ కరువు సామ్రాజ్యవాద దోపిడీ పర్యవసానం. సామ్రాజ్యవాదుల నిజస్వరూపాన్ని బట్టబయలు చేయడానికి జనా ఫోటోలు ఎంతగానో దోహదపడ్డాయి. అందుచేతనే అవి ఒక్క భారత కమ్యూనిస్టు పార్టీ పత్రికలోనే కాకుండా ప్రపంచంలోని పలుదేశాల కమ్యూనిస్టు పార్టీల పత్రికల్లోనూ ప్రచురితమయ్యాయి.



భారత దేశంలోని స్టేట్స్‌మన్, ఇలస్ట్రేటెడ్ వీక్లీ లాంటి పత్రికల్లోనూ దర్శనమిచ్చాయి. వాటిని పిక్చర్ కార్డులుగా తయారు చేసి కరువు సహాయక చర్యలకు నిధుల సేకరణ కోసం కూడ ఉపయోగించారు. ఈ ఫోటోలు తీసే సమయంలో తాను ఎంతగానో ఇబ్బంది పడ్డానని సునీల్ జనా చెప్పేవారు. ఆకలితో అలమటిస్తూ, అస్థిపంజరాలుగా మారి చావుకు దగ్గరయిన వారి మీదకు కెమెరాను ఫోకస్ చేస్తుంటే చాల బాధగా ఉండేదని, 'నీవు ఓ చరిత్రను నమోదు చేసి చూపుతున్నావు. అది నీ కర్తవ్యం.' అని పిసి జోషి తనను సముదాయించేవారని అంటుండేవారు. తాను ఫోటోలు తీస్తున్నప్పటికీ, సహాయక చర్యల్లో పాల్గొని, కష్టాల్లో ఉన్నవారికి సహాయపడుతున్న కార్యకర్తల పట్ల 'అసూయ'గా ఉండేదని ఆయన తెలిపారు. బెంగాల్ కరువు తర్వాత ఒరిస్సా కరువు ఫోటోలను కూడ సునీల్ జనా తీశారు.

ఈ పని ముగిసిన తర్వాత, నీవు కలకత్తాలో కాదు, పార్టీ కేంద్ర కార్యాలయం బొంబాయిలో ఉండాలని, పూర్తికాలం కార్యకర్తగా రావాలని పిసి జోషి సునీల్ జనాను కోరారు. జనా వెనువెంటనే తన అంగీకారాన్ని తెలిపారు. తన తల్లిదండ్రులకు అది అంతగా నచ్చలేదు. కొద్ది రోజుల్లోనే ఎగ్జామ్స్ ఉన్నాయి కాబట్టి, కనీసం ఎంఏ పూర్తిచేసయినా వెళ్లమని చెప్పారు. పిసి జోషిని ఇదే విషయం అడిగితే ఆయన ఎగ్జామ్స్ పూర్తిచేయడం ముఖ్యం కాదు, నీవు వెంటనే బయలుదేరాల్సిందేనని ఆదేశించారు. ఆ విధంగా ఆయన 20 రూపాయల నెలవేతనంతో పూర్తికాలం పార్టీ కార్యకర్తగా జీవితాన్ని ఆరంభించారు. ఈ సమయంలోనే బెంగాల్‌కే చెందిన చిత్రకారుడు చిత్తప్రసాద్ కూడ జోషి కోర్కె మేరకు పార్టీపూర్తికాలం కార్యకర్తగా బొంబాయి చేరుకున్నారు. అప్పట్లో భారత రాజకీయాల్లోనే కాకుండా కళాసాంస్కృతిక రంగాలలోను కమ్యూనిస్టుపార్టీ ప్రముఖ పాత్రనిర్వహించేది.

బొంబాయి నుండి పనిచేస్తూ సునీల్ జనా పార్టీ ఎక్కడికి పంపితే అక్కడికి వెళ్లి దేశమంతటా తిరిగి ఫోటోలను తీసేవారు. ఈ క్రమంలోనే ఆయన తెలంగాణా సాయుధ రైతాంగ పోరాటం, వర్లీ ఆదివాసుల పోరాటం, ఐఎన్ఏ తిరుగుబాటు అనంతర పరిణామాలను, ఆర్ఐఎన్ తిరుగుబాటు ఫోటోలను– తన కెమెరాలో బంధించారు. దేశమంతా తిరుగుతూ అనేక జాతీయోద్యమ నేతల ఫోటోలనూ తీశారు. గాంధీజీ హత్యకు ముందురోజు ప్రార్ధనాసమావేశంలో ఫోటోనూ ఆయన తీశారు. అంతకుముందు ఉన్న కెమెరాతోపాటు, పార్టీ అభిమాని ఎవరో ఇచ్చిన ఆనాటికి ఓ మంచి కెమెరాతో ఆయన పనిచేసేవారు. ఫిల్ములు కూడ దాదాపు కొనేవారు కాదు. బొంబాయి సినీ స్టూడియోలలో పనిచేసే కార్మికులు, అక్కడ మిగిలిపోయిన ఫిల్ములను పట్టుకొచ్చి ఇస్తే వాటినే వాడేవారు.

బొంబాయిలో ఉండగానే సునీల్ జనా ఫోటోగ్రఫీ జీవితంలో ఓ ముఖ్య ఘట్టం చోసుకుంది. లైఫ్ పత్రికలో పనిచేస్తున్న అమెరికాకు చెందిన మహిళా ఫోటో జర్నలిస్టు మార్గరెట్ బోర్క్ వైట్ భారత దేశంలో ఫోటోలు తీయడానికి వచ్చారు. అంతకు ముందే ఆమె సునీల్ జనా ఫోటోలను చూసి, ఆయనలోని ప్రతిభను గుర్తించారు. వామపక్షఅభిమాని కూడ అయిన ఆమె పిసి జోషి వద్దకు వెళ్లి భారత దేశంలో తన పర్యటనలో తోడుగా సునీల్ జనాను పంపమని కోరారు. ఆమెతో పాటు దేశంతా తిరుగుతూ సునీల్ జనా దారుణ మత కల్లోలం, భయంకరమైన వలసలు సహా అనేక ఫోటోలను తీశారు. ఆమె తీస్తున్న సబ్జెక్టునే ఈయనా ఫోటో తీసేవారు. కాని ఎవరి శైలి వారిది. ఆమెవద్ద అప్పట్లో అధునాతనమైన ఫ్లాష్ సిస్టమ్ ఉండేది. దానితో సబ్జెక్టుకు ఎదురుగా ఆమె ఫోటో తీస్తుంటే, అదే సమయంలో ఓ పక్కనుండి సునీల్ జనా అదే సబ్జెక్టును ఫోటో తీసేవారు. అందుచేతనే ఆయన ఫోటోలలో ఎక్కువభాగం సైడ్ యాంగిల్‌లో ఉంటాయి. అంతేకాదు, ఐజెన్‌స్టీన్ లాంటి ప్రసిద్ధ దర్శకులు సినిమాలను అభిమానించే సునీల్





# వీధి గోడ

- రెడ్డి శంకరరావు
సెల్ : 9494333511

విరిగి పడుతున్నాయి...
పచ్చని ప్రపంచాన్ని
ఫలహారంగా భోంచేసి
నిర్మించుకున్న సామ్రాజ్యపు
దేగరెక్కలు తెగిపడుతున్నాయి

పౌర్ణమి వెన్నెల కాంతుల్లా
విరాజిల్లుతున్న వైట్‌హౌస్
మసకబారుతున్నది...

నాటి భూతల స్వర్గం
నేడు యమలోకమైంది
నిన్న సబ్ ప్రైమ్ రుణంతో
నిర్మించుకున్న స్వర్గసీమలాంటి ఇల్లు
నేడు దెయ్యాల కొంపై...
ఒక్క ఉదుటన వీధిలోకి నెట్టింది

రాత్రి ఆకాశంలో చుక్కల వెలుతురు
పగలు సూర్యుని కాంతి కిరణాలు
మా జీవితాల్లో అలుముకున్న
అమావాస్య చీకట్లు దాటెందుకు
దారిచూపాయి

ఏ దిక్కులేని మాకు
వాల్‌స్ట్రీట్ వజ్రాయుధమైంది
ఎవరు వినని మా గోడు...
జులకుటా పార్కు విని అక్కున చేర్చుకుంది...
మా ఘోష శబ్దతాండవం చేసి
మా విధానాలు నినాదాలై...
అమెరికా విను వీధులు... కాదు
సంయుక్త రాష్ట్రాలు... కాదు.. కాదు
ఎల్లలు చెరిపి... దిక్కులు దాటి
సరిహద్దులు లేని ప్రపంచమంతా సోకింది

ఇప్పుడు మేము ఒంటరివాళ్ళం కాదు
మాది ఒంటరి పోరూ కాదు
ఆకలి కేకలు వేస్తున్న
యాచకులం కాదు మేము
మా అరణ్య రోదనకి కారణభూతమైన
పెట్టుబడి భూతాన్ని తరిమికొట్టేందుకు
కంకణబద్ధమైన...
కన్నీటి ప్రవాహం మాది

అలల సవ్వడి... అగ్నిగుండమైంది
బ్రద్దలైన అగ్ని పర్వతంలా
ఉద్యమ కెరటాలు ఎగిసి పడుతున్నాయి
ఈ మాటలు వెనుక మంటలు
చల్లారేవి కాదు..
ఆర్పేందుకు ఇంకా
ఈ భూప్రపంచంపై ఏ శాస్త్రం పుట్టలేదు
మా పయనం... సమసమాజం వైపు
మా దారి మరో ప్రపంచపు దారి
అందుకే చెపుతున్నాం వినండి!
పిల్లలకి పాలివ్వలేని తల్లుల్లారా...
ముసలి తల్లులకి కూడు పెట్టలేని
నిరుద్యోగ యువకుల్లారా
నేటి వాల్‌స్ట్రీట్ ఉద్యమ విత్తనాలు
విశ్వమంతా వెదజల్లుతాం
ఓ ఉషోదయాన...
మరో ప్రపంచం..
మొక్కలై మొలకెత్తుతాం

---

జనా వింటేజ్ పద్ధతిలో సబ్జెక్టును క్రిందినుండి పైకి కనిపించే విధంగా ఫోటో తీసేవాడు. దానితో అవి మరింత ప్రత్యేకంగా కనిపిస్తాయి. ఇదంతా లైఫ్ పత్రిక వారి ఖర్చుతోనే. అందుచేతనే, సామ్రాజ్యవాదుల డబ్బుతో కమ్యూనిస్టుల పనిచేశానని ఆయన హాస్యంగా చెప్పేవారు.

పార్టీలో జరిగిన పరిణామాల ఫలితంగా సునీల్ జనా తిరిగి కలకత్తాకు వచ్చేశారు. స్వంతంగా స్టూడియోను ఏర్పాటుచేసుకున్నారు. శోభ అనే ఓ డాక్టరును వివాహమాడారు. కలకత్తాలో ఉంటూ ఆయన అనేక కమర్షియల్ ప్రాజెక్టులపై పనిచేశారు. స్వాతంత్ర్యానంతర అభివృద్ధిని సూచించే అనేక పరిశ్రమల ఫోటోలును తీశారు. ఇదే సమయంలో డ్యాన్సర్లు, సంగీత విద్వాంసులు లాంటి వారి ఫోటోలనూ తీశారు. భారత దేశంలోని దేవాలయాలు, వాటిలోని శిల్పసంపదను ఎంతో నైపుణ్యంతో ఫోటోలు తీశారు. ఈ ఫోటోలు మార్గ్ లాంటి ఆర్ట్ పత్రికల్లో ప్రముఖంగా ప్రచురించబడ్డాయి. ఈ కాలంలో ఆయన ఫోటోగ్రఫీ పయనంలో మరో ముఖ్య ఘట్టం, ఆంత్రపాలజిస్టు వెరియర్ ఎల్విన్‌తో కలిసి భారత దేశంలోని గిరిజనుల ఫోటోలను తీయడం. వారిలోని సహజమైన అందాన్ని అమాయకత్వాన్ని తన అపురూపమైన ఫోటోలద్వారా అద్భుతంగా చూపించారు. ఆంత్రపాలజీ అధ్యయనంలో భాగమే అయినప్పటికీ, సునీల్ జనా ఫోటోలు వాటికవే కళాఖండాలుగా పేరుగాంచాయి. రాజకీయ పరమైన ఫోటోలనూ తీస్తూనే ప్రజల ఆయా ప్రాంతాల ప్రజల దైనందిన జీవితాన్నీ జనా ఫోటోలు తీస్తుండేవారు. ఆయన కృషిలో అవి ప్రత్యేక ప్రాధాన్యత కలిగి ఉన్నాయి.

భార్య శోభ వైద్యవృత్తి కోసం లండన్ వెళ్లడంతో సునీల్ జనా 64 ఏళ్ల వయసులో కలకత్తానుండి వెళ్లిపోయి ఇంగ్లండులో స్థిరపడ్డారు. లండన్‌లోను, అమెరికాలోను ఆయన చిత్రాల ప్రదర్శనలు అనేకం జరిగాయి. పుస్తకరూపంలో కూడ ఆయన ఫోటోలు ప్రచురించబడ్డాయి. అనుమతి తీసుకొని, కనీసం తెలపకుండా కూడ - ఆయన ఫోటోలు అనేకం ఉపయోగించుకోబడ్డాయి. వ్యాపారదృష్టి లేని సునీల్ జనా తన కృషిని సొమ్ముచేసుకోవడానికి ప్రయత్నించలేదు. సహ్మత్ నాయకుడు, ప్రసిద్ధ ఫోటోగ్రాఫర్ రామ్‌రహ్మాన్ 1998లో 'సునీల్ జనా-ఫోటోగ్రాఫింగ్ ఇండియా 1942-1978' అనే పేరుతో న్యూయార్క్‌లో ఏర్పాటు చేసిన ఆయన అన్ని తరహాల ఫోటోల ప్రదర్శనకు న్యూయార్క్‌టైమ్స్ పత్రిక ఫుల్ పేజీ వ్యాసాన్ని ప్రచురించిందంటేనే ఫోటోగ్రాఫర్‌గా సునీల్ జనా ప్రతిభ ఎంతటిదో అర్థం చేసుకోవచ్చు. ఆయన కేవలం ఫోటోగ్రాఫర్ మాత్రమే కాదు. స్పష్టమైన రాజకీయ అభిప్రాయాలు కలిగిన వ్యక్తి. చివరివరకు సోషలిజమే మానవాళి విముక్తికి మార్గమని విశ్వసించారు. ■

# గజల్ రారాజు మెహ్దీహసన్



- సింహాద్రి సరోజిని

'పత్తా పత్తా బూటా బూటా', 'కబ్ కే బిఛరే' వంటి ఎవర్‌గ్రీన్ హిట్స్ వెనుక ఉన్న మధురమైన గళం ఇక మనకు విన్పించదు. భారత్‌లో పుట్టి, పాకిస్తాన్‌లో గాయకునిగా ఎల్లలు లేని సంగీతాన్ని ప్రవహింపజేసిన గజల్ రారాజు మెహ్దీహసన్ ఇక మనకు లేరు. తన మనోజ్ఞమైన కంఠంతో, స్పష్టమైన ఉచ్చారణతో ఉర్దూ గజళ్ళకు సొబగులద్దడం ఆయనకే సాధ్యం. భాష తెలియకపోయినా ఆయన గళ మాధుర్యంలో ఓలలాడని వారుండరు. మెహ్దీ గజళ్ళకు భారత్, పాకిస్తాన్‌లో మాత్రమే గాక ప్రపంచవ్యాప్తంగా పెద్ద సంఖ్యలో అభిమానులున్నారు.

ప్రస్తుతం పాకిస్తాన్ పౌరుడైన హసన్ రాజస్థాన్‌లోని లూనా అనే చిన్న గ్రామంలో సంప్రదాయ సంగీత కుటుంబంలో 1927, జూలై18న కళావంతుల తెగలో జన్మించారు. ఆ తెగలో ఆయన 16వ తరానికి చెందినవారు. 1947 దేశ విభజన సమయంలో ఆయన కుటుంబం పాకిస్తాన్‌కు వలస వెళ్ళింది. చిన్నతనం నుంచే తన తండ్రి ఉస్తాద్ అజీమ్‌ఖాన్, బాబాయి ఉస్తాద్ ఇస్మాయిల్ ఖాన్ వద్ద ధ్రుపథ్ సంగీతంలో శిక్షణ పొందారు. మెహ్దీహసన్ అతి పిన్న వయస్సులోనే ధ్రుపథ్, ఖయాల్‌ను తన అన్నతో కలిసి కచేరీల్లో పాడుతుండేవారు. ఎనిమిదేళ్ళ వయస్సు నుంచే పాడటం ప్రారంభించిన ఆయన దాదాపు 325 పాటలు పాడారు. భారత్, పాకిస్తాన్ మధ్య సాంస్కృతిక రాయబారిగా అత్యంత విశిష్టమైన పాత్ర పోషించారు. ఉస్తాద్ బర్కత్ అలీఖాన్, బేగం అక్తర్, ముక్తార్ బేగం వంటివారు పాకిస్తాన్‌లో ప్రముఖ గజల్ గాయకులుగా ఖ్యాతి గడించిన సమయంలోనే హసన్ ధ్రుపథ్ గాయకునిగా తొలుత ప్రాచుర్యం పొందారు. ఆయన గాత్రమివ్వకపోతే ఆ చిత్రం అసంపూర్ణమే అనే పరిస్థితి ఒకప్పుడు పాకిస్తాన్ చిత్ర పరిశ్రమలో ఉండేది. దీన్ని బట్టే ఆయన ఎంతటి గాయకుడో మనం అర్థం చేసుకోవచ్చు. భారత కోకిలగా పేరుగాంచిన లతా మంగేష్కర్‌తో కలిసి 2010లో పాడిన 'సరిహదే' అనే తొలి, చివరి పాట విడుదలైంది. అయితే ఈ పాటలో ఒక విశేషముంది. ఫర్హత్ షెహజాద్ రచించిన ఆ పాటకు మెహ్దీ స్వయంగా స్వర కల్పన చేసి తాను పాడాల్సిన భాగాన్ని 2009లో పాకిస్తాన్‌లో రికార్డు చేశారు. తరువాత ఆయన పాడిన దాన్ని విని లతా మంగేష్కర్ తన వంతు పాటను 2010లో భారత్‌లో పాడారు. తరువాత ఆ రెండింటినీ మిళితం చేసిన యుగళగీతాన్ని అదే సంవత్సరం అక్టోబర్‌లో హెచ్ఎంవి విడుదల చేసింది.

ఆయన తొలుత సైకిల్ మెకానిక్‌గా, తరువాత కారు, ట్రాక్టరు మెకానిక్‌గా పనిచేశారు. దాని వల్ల వచ్చే ఆదాయం చాలక కుటుంబ పోషణ నిమిత్తం ధుమ్రీ గాయకుని నుంచి ఎక్కువ ఆదాయాన్ని తెచ్చిపెట్టే గజల్ గాయకునిగా రూపుదాల్చారు. గజల్ రారాజుగా గొప్ప పేరు గడించినప్పటికీ ఆయనకు సాంప్రదాయ సంగీతజ్ఞుల పట్ల ఎనలేని గౌరవం, రాజస్థాన్ పట్ల అపార ప్రేమ ఉండేవని జోథ్‌పూర్‌కు చెందిన మేవతీ ఘరానాకు చెందిన పండిట్ ప్రతాప్ నారాయణ్ కుమారుడు, పండిట్ జస్రాజ్ మేనల్లుడు అయిన గాయకుడు, స్వరకర్త లలిత్ పండిట్ చెప్పారు. అర్థతో కూడిన గానం ద్వారా ప్రపంచ సంగీతానికి పాకిస్తాన్ తరపున ఆయన గొప్ప సేవలందించారని అన్నారు. గాయనీమణులకు లతా మంగేష్కర్ ఎలాగో గాయకులకు మెహ్దీ సాబ్ అలా రోల్ మోడల్‌గా ఉన్నారని లలిత్ తెలిపారు. పాకిస్తాన్ నటుడు, గాయకుడు, స్వరకర్త అలా జఫర్ తన ఝూమ్ ఆల్బమ్‌లో 'జానే మన్' అనే పాటను మెహ్దీహసన్‌కి అంకితమిచ్చారు. మరో గజల్ గాయకుడు జగ్జీత్ సింగ్ గజల్స్‌ను సామాన్యులకు కూడా అర్థమయ్యే రీతిలో తీర్చిదిద్దగా వాటికి మెహ్దీ ప్రాణ ప్రతిష్ట చేశారు. ఈ తరమే గాక, ముందు తరాలు కూడా ఆస్వాదించే రీతిలో ఆయన తన గజల్స్‌ను గానం చేశారు. తాను మెహ్దీ సాబ్‌తో కలిసి ఒకే వేదికపై పాడలేకపోయినందుకు ప్రముఖ గాయని లతా మంగేష్కర్ ఎంతో బాధపడ్డారు. ఆయనది ఒక విశిష్టమైన గళమని ప్రశంసించారు.

మెహ్దీ ధ్రుపథ్ సంగీతం నుంచి ధుమ్రీకి, అక్కడి నుంచి గజల్‌కు, అనంతరం అత్యంత ప్రజాదరణ ఉన్న చిత్ర సంగీతానికి ఎదిగారు. 1950ల ప్రారంభంలో ఆయన ఫైజ్ అహ్మద్ ఫైజ్ రచించిన 'గులోం మే రంగ్ భరే, 'బాద్ ఏ నౌ బహార్ చలే' అనే గజల్ గానం చేయడం ద్వారా వెలుగులోకి వచ్చారు. ఆయనకు 1957లో ప్రాథమికంగా ధుమ్రీ గాయకునిగా పాకిస్తాన్ రేడియోలో పాడేందుకు

# రసయోగం



- నందవరం కేశవరెడ్డి
సెల్ : 9885120878



ఆకలి జీవులకు తన కండల్ని యిచ్చేసినట్లు
కోరుకున్న వారికి తన ఇసుకను ఇచ్చేసి
గుంతలు తేలిన దేహంతో
ఆకాశం వైపు చూస్తూ
పడుకున్న ఈ నది
యెప్పుడూ చూసిందే అయినా
ఈ రోజెందుకో కొత్తగా చూస్తున్నట్లుంది

లేస్తూనే ఉదయించే సూర్యుని
నెత్తిన పెట్టుకుని
ఈ లోకానికి ప్రసాదిస్తున్నట్లు
ఒంగోలు గిత్త మూపురంలా
కనిపించే ఈ కోడిగుడ్డు గుట్ట
యెప్పుడూ చూసిందే అయినా
ఈ రోజెందుకో కొత్తగా చూస్తున్నట్లుంది

సాయంత్రం నాలుగు రోడ్ల కూడలిలో
గూబపగిలేలా శబ్దిస్తూ
మెడాలు తొక్కుకుంటూ తోసుకుంటూ
వర్షాకాలంలో ఉధృతంగా పారే ప్రవాహంలా
ఈ గుంపు
యెప్పుడూ చూసిందే అయినా
ఈ రోజెందుకో కొత్తగా చూస్తున్నట్లుంది

పయి అంతా సిల్వర్ పెయింట్‌తో
చేతికర్ర వూతగా
కదలకుండా రెప్పార్పకుండా

ఆకలికి ప్రతిరూపంగా నిల్చున్న
ఈ బడి యీడు పిల్లోడి దృశ్యం
యెప్పుడూ చూసిందే అయినా
ఈ రోజెందుకో కొత్తగా చూస్తున్నట్లుంది

యింటి పని వంట పనుల వొత్తిడితో
ముసివారిన మొహంతో
తను యెండిన కాయమై
యింటికి గుండె కాయయై
కనిపించే ఈ యిల్లాలి రూపం
యెప్పుడూ చూసిందే అయినా
ఈ రోజెందుకో కొత్తగా చూస్తున్నట్లుంది

యెద లాబ్‌లో
యేదో జరిగిన రసయోగం
గిలకొట్టిన జీవన సారం

---

అవకాశం లభించింది. అది ఆయనకు సంగీతకారుల్లో గుర్తింపును తెచ్చిపెట్టింది. ఆయనకు ఉర్దూ కవిత్వం పట్ల ఎనలేని మక్కువ ఉండేది. దాంతో పార్ట్ టైం ప్రాతిపదికన గజల్స్ పాడటం ప్రారంభించారు. ఆయన గజల్ గాయకునిగా పురోగమించడంలో నగర రేడియో అధికారులు కొందరు ఎంతగానో తోడ్పాటునిచ్చారు. అలా క్రమంగా ఆయన పాకిస్తాన్‌లోనూ, భారత్‌లోనూ అత్యంత ప్రముఖ గజల్ గాయకునిగా ఎదిగారు. మెకానిక్‌గా ఉన్నప్పుడు కూడా క్రమం తప్పకుండా సంగీత సాధన చేసేవారు. చివరి వరకూ కూడా ఆయన తన గళంలోని స్వచ్ఛతను, స్పష్టతను కోల్పోలేదు. మెహ్దీ సంగీతంలో భారతీయత కొట్టొచ్చినట్లు కన్పిస్తుంది. హసన్ సంగీతం అనేక తరాల గజల్ గాయకులకు స్ఫూర్తినందించింది. ఆయన ఫైజ్ అహ్మద్ ఫైజ్, మీర్ తారిక్ మీర్‌తో పాటు భారతీయ కవి మీర్జా గాలిబ్ గజళ్ళను కూడా తరచుగా గానం చేస్తుండేవారు. మెహ్దీ ఉర్దూ గజళ్ళను భాషలోని స్వచ్ఛత ప్రతిబింబించేలా పాడేవారు. 'రంజిష్ హీ సహీ... దిల్ హీ దుఖనే కేలియో' అనే గజల్‌ను వేరెవరూ మెహ్దీ అంత హృద్యంగా పాడలేరని చెబుతారు. ఆయన భారత్, పాకిస్తాన్‌లోని గజల్ ప్రేమికులను మంత్రముగ్ధుల్ని చేశారు.

ఆయనకు పాకిస్తానీయునిగా ముద్ర వేసే ప్రయత్నం జరిగింది. అయితే అది సరైంది కాదనేది పలువురి అభిప్రాయం. 'సూర్యకాంతి వలె, గాలి దిశ వలే ఆయనను కూడా ఒక దేశానికి పరిమితం చేయరాదు' వహ్ సారీ కయానత్ కే సితారే హై (ఆయన ప్రపంచ తార)' అని హిందీ కవి గుల్జార్ అభివర్ణించారు. ఆయన కోసం గుల్జార్ 'ఆంఖోంకో వైసా నహీ లగ్తా, సప్నోంకీ సరహద్ హోతీ నహీ, బంద్ ఆంఖోంసే రోజ్ చలా జాతా హూ సరహద్ పార్ మైనే మిల్నే మెహ్దీ హసన్ సే (కళ్ళకు అలా అన్పించదు, కలలకు సరిహద్దులుండవు. కళ్ళు మూసుకొని సరిహద్దులు దాటి మెహ్దీ హసన్‌ను కలుసుకునేందుకు రోజూ వెళ్తూనే ఉంటాను)' అని కవిత రాశారు. ఫైజ్ అహ్మద్ ఫైజ్, మెహ్దీ హసన్, లతా మంగేష్కర్ వంటి వారిని వారి జాతీయతను బట్టి విభజించజాలమని అన్నారు. 'మనం ఆయన స్మృతులను మరువరాదు. ఇక్బాల్ పాకిస్తాన్ కవి అయినప్పటికీ మనం ఆయన రచించిన 'సారే జహాసే అచ్చా' గీతాన్ని పాడుకుంటున్నాం. అలాగే మెహ్దీ హసన్ కూడా మనందరి వాడు' అని ప్రముఖ చలనచిత్ర నిర్మాత మహేష్ భట్ అన్నారు. వీరందరి మాదిరిగానే ప్రపంచవ్యాప్తంగా ఉన్న కోట్లాది అభిమానులకు మెహ్దీ ఎల్లలెరుగని గొప్ప కళాకారుడు. ఆయన తన సంగీత ఘరానా సాంప్రదాయంలో పూర్తిగా మునిగిపోయారు. మత ఆదేశాల కంటే కూడా తనకు ఆ సాంప్రదాయమే గొప్పదని భావించేవారు. ఆయన సంగీతంలో గొప్ప సార్వజనీనత ఉండేది. ఆయన గొప్ప హాస్యప్రియులు కూడా. ఒకసారి సంగీత కచేరీ చేసేందుకు వేరే చోటికి వెళ్తుండగా ప్రయాణంలో ఆయన హార్మోనియం పాడైపోయింది. 'నేను ఒకప్పుడు ఆటో మెకానిక్‌గా ఉండేవాణ్ణి. ట్రాక్టర్ ఇంజన్లను అసెంబుల్ చేసేవాణ్ణి. హార్మోనియాన్ని అసెంబుల్ చేయడం నాకు పిల్లల ఆట వంటిదే' అని అప్పుడాయన ప్రేక్షకులతో అన్నారు.

ఆయనకు లెక్కలేనన్ని అవార్డులు లభించాయి. తంఘా-ఇ-ఇంతియాజ్, ప్రైడ్ ఆఫ్ పెర్ఫార్మెన్స్, హిలాల్-ఇ- ఇంతియాజ్' అనే అవార్డులు పాకిస్తాన్‌లో లభించాయి. ఇంకా పాకిస్తాన్ నుంచి నైగర్ ఫిల్మ్ గ్రాడ్యుయేట్ అవార్డులే గాక జలంధర్‌లో 1979లో సైగల్ అవార్డు లభించింది. 1983లో నేపాల్ ఆయనకు గూర్ఖా దక్షిణ బాహూ అనే అవార్డునిచ్చింది. ఇటీవల మరో అవార్డును అందుకునేందుకు ఆయన దుబాయ్ కూడా వెళ్ళి వచ్చారు. 'వేణువై వచ్చాను భువనానికి, గాలినై పోతాను గగనానికి' అన్నట్లు ఆయన తన స్వర మాధుర్యంతో ఈ ప్రపంచాన్ని మైమరపింపజేశారు. మృదుమధురమైన తన గజళ్ళను వదిలి దూర తీరాలకు వెళ్ళిపోయారు.

**(మెహ్దీ హసన్ జూన్ 13న కన్నుమూశారు)**



# కష్టజీవుల కవి 'యాసలపు సూర్యారావు'

- సత్యాజీ
సెల్ : 9490099167

అక్షరం, ఆచరణ రెంటినీ కలగలిపి నడిపించడం అందరికీ సాధ్యం కాదు. ఉద్యమం, జీవితం చెట్టాపట్టాలేసుకుని నడవడమూ అంత ఆషామాషీ కాదు. ప్రజా ఉద్యమ ప్రస్థానంలో ఆటుపోట్లు తట్టుకొని... కష్టనష్టాలు ఎదుర్కొని... కవిగా, రచయితగా, అంతకుమించి ప్రజా ఉద్యమ కార్యకర్తగా, నాయకుడిగా రాణించడం సామాన్య విషయం కాదు. ఈ కాదు కాదు అనుకుంటున్న కార్యస్థలిలోనే దిగ్విజయంగా రాణించాడు యాసలపు సూర్యారావు. నీతికీ, నిజాయితీకి, నిబద్ధతకీ నిలువెత్తు రూపంగా నిలిచాడు. 62 ఏళ్ళ సూర్యారావు ఈ నెల 22న తుదిశ్వాస విడిచాడు.

సూర్యారావు పాఠశాలకు వెళ్ళాడో లేదో తెలీదు. ఆ విషయం తనకే గుర్తు లేదు. మట్టి పలక మీద ఏవో కొన్ని అక్షరాలు దిద్దినట్లు గుర్తు. ఊహ తెలీనప్పటి నుంచీ కష్టాలు సుపరిచితం. దేన్నీ ఆషామాషీగా తీసుకునే రకం కాదు. దేన్నయినా తరచి తరచి చూడాల్సిందే! గీటు పెట్టి నిగ్గు తేల్చాల్సిందే! తార్కిక వాదంతో తొక్కూ తాలూ పక్కకు తప్పుకోవల్సిందే! వాదనకు నిలబడని ఏ విషయాన్నీ అతడు నమ్మలేదు. కులాలూ, మతాలూ, దేవుడూ, దెయ్యం లాంటివి చిన్నప్పుడే అతడి మనసు తెరపై నుంచి మాయం అయిపోయాయి. కొందరికి ఆకలీ, దారిద్ర్యమూ ఎందుకో, ఇంకొందరికి ఆకాశ హర్మ్యాలూ, తరగని విలాసాలూ ఎందుకో చిన్నపుడే తర్కించి, వాదించి... ఎడతెగని ఆలోచనలకు గురయ్యాడు. 12 ఏళ్ళ వయసులో కమ్యూనిస్టు పార్టీ పరిచయం, విజ్ఞాన తరగతుల ప్రభావం అతడి ఆలోచనలకు పదును పెట్టాయి. సత్యాన్వేషణకు సరైన మార్గం దొరికినట్టయింది. బాల్యంలో నేర్చుకున్న మట్టి పలక అక్షరాలను మనోక్షేత్రంలో నిరంతరం దిద్దడం మొదలెట్టారు. 'జనశక్తి' పత్రికను ఇంటింటికీ పంచే పని చేస్తూనే దాన్లోని వార్తలు, వ్యాసాలూ కూడబలుక్కొని చదివాడు. సైకిల్ షాపులో మెకానిక్కుగా ఉంటూ ఖాళీ సమయంలో పుస్తకాలు చదివాడు. తనలో తలెత్తుతున్న ప్రశ్నలన్నింటికీ జవాబులు దొరకడంతో... అతడి ఆలోచనల్లో... ఆచరణలో కొత్త పంథా మొదలైంది.

ప్రజానాట్యమండలి పరిచయం అతడిలో భావోద్వేగం రెక్కలు తొడిగింది. నెమ్మదిగా కవిత్వం రాయడం మొదలెట్టాడు. చుట్టూ జరుగుతున్న అన్యాయాలపై నాటికలు రాశాడు. ప్రజల సమస్యలపై పాటలు అల్లాడు. పిల్లల కోసం కథలు వెలువరించాడు. సంస్కృతి, జానపద కళలు అంటే ఎడతెగని మక్కువ. ఊరూరా తిరుగుతూ బిచ్చమెత్తుకునే కళాకారులతో స్నేహం చేశాడు. వాళ్ళ పాటలు, మాటలూ రికార్డు చేశాడు. ఆ కళల పుట్టుకా, వికాసం, ప్రస్తుత పరిస్థితిపై పరిశోధనకు దోహదపడేలా వ్యాసాలు రాశాడు. ప్రాథమిక స్థాయి విద్య కూడా పాఠశాలలో నేర్వని మీరు ఇవన్నీ ఎలా చేయగలిగారు అని ఎవరైనా అడిగితే ఒకే ఒక్క మాట చెప్పేవాడు. "కమ్యూనిస్టు పార్టీ గొప్పదనం వల్ల... పార్టీ నేర్పిన ఆలోచనల వల్ల... పార్టీ నేర్పిన క్రమశిక్షణ, అధ్యయన పద్ధతుల వల్ల..." అని.

సూర్యారావు, 'ప్రజ్వలనమ్', 'తల్లీ గోదావరీ', 'ఆడు మగాడు', 'పేగుబంధం', పేరుతో నాలుగు కవితా సంపుటాలు వెలువరించారు. ఈ కవితల నిండా సమకాలీన సమస్యలే పరుచుకొని ఉంటాయి. కవితల్లో ఆవేదన, ఆకలింపు ఎంత కనిపిస్తుందో – అవసరమైన చోట ఆగ్రహమూ అంతే ధ్వనిస్తుంది. సమన్వయం, సహనం కనిపిస్తూనే సమరనాదమూ వినిపిస్తుంది. ఆయన కవిత్వం ఆలోచింపచేసేదిగా ఉంటుంది. అందరికీ అర్థమయ్యేలా ఉంటుంది. ప్రపంచీకరణ పేగుబంధాన్ని సైతం విచ్ఛిన్నం చేయడం, సెజ్‌లు రైతులను నిర్వీర్యుల్ని చేయడం, బహుళజాతి సంస్థలు గిరిజనులను, మత్స్యకారులను ఆవాసాల నుంచి వెళ్ళగొట్టడం... ఇలాంటి నేటి భారతపు సమకాలీనత అంతా సూర్యారావు కవిత్వంలో సజీవ దృశ్యంగా కనిపిస్తుంది. అణగారిన వర్గాల ఆక్రందన, ఆవేదనా ఆయన అక్షరాల్లో ప్రతిధ్వనిస్తుంది. సమస్యను సమస్యగా చెప్పి ఊరుకోవడం కాదు. దాని మూలాల్లోకి, పర్యవసానాల్లోకి వెళ్ళి పాఠకుడి కళ్ళకు కడతారు. ఎక్కడా నిరాశ, నిస్పృహ ధ్వనించదు. స్పష్టమైన కార్యాచరణ, విస్పష్టమైన ఆశాభావం పరితల్లో కలిగిస్తాడు. తాను స్వయంగా సమస్యలపై పోరాడే కార్యకర్త కావడం వల్ల – ఆయన కవిత్వం నిండా వెల్లువెత్తే పిడికిళ్ళూ, మార్మోగే కంఠధ్వనులూ అందమైన రేపటికి భరోసానిస్తాయి.

సూర్యారావు మూడు నాటికలు రాశారు. అవి : ఊరు మేల్కొంది, విముక్తి, మేల్కొలుపు, పాటలతో 'బతుకు పాట' ప్రచురించారు. 'పిట్ట కొంచెం – కూత ఘనం' పేరుతో బాలల కథల సంపుటి వెలువరించారు. అనేక రాష్ట్ర స్థాయి పోటీల్లో కవితలకు, కథలకు బహుమతులు పొందారు. వీటన్నింటికీ మించి, తుదిశ్వాస విడిచేవరకూ క్రమశిక్షణ, నిబద్ధత కలిగిన ఉద్యమ కార్యకర్తగా ఉన్నారు. సిపిఎం తరపున రెండుసార్లు పెద్దాపురం మున్సిపల్ కౌన్సిలర్‌గా ఎన్నికై, ప్రజల సమస్యలపై విశేష కృషి చేశారు. చెంచులు, గంగిరెద్దుల వారు వంటి సంచార జీవులకు పట్టణంలో స్థిరనివాసం, రుణాలు, రేషన్ కార్డులు ఇప్పించడానికి వివిధ దశల్లో పోరాడి, విజయం సాధించారు. సాహితీ స్రవంతి తరఫున ఎన్నో కార్యక్రమాలు నిర్వహించారు. సూర్యారావు ఉద్యమ కార్యకర్తగా ఏ సమస్యలపై పనిచేశాడో వాటినే కవిత్వంగా, కథలుగా మలిచాడు. కవిగా, రచయితగా దేన్నయితే రాశాడో, దానినే ఆచరణలో పెట్టడానికి అహర్నిశలూ శ్రమించాడు. ప్రముఖ కవి, సాహితీ విమర్శకులు అద్దేపల్లి రామ్మోహనరావు పేర్కొన్నట్లు 'యాసలపు సూర్యారావు ధన్యజీవి. అక్షరాలా కష్టజీవుల కవి. ప్రజల మనిషి.'

కథ

# కుట్ర



- గనారా

**"ఓలమ్మా! ఓలమ్మా! ఏటే తల్లీ! తెల్లారి గట్టంకించుకున్నావు. ఏటనిసేదేటి? - మొగుడన్నాక ఆ మాత్రము అనడా? కొట్టడా! తిట్టడా! సిత్రం సేత్తున్నావ్!"**

**"ఊరుకో పిన్ని! అంతంత మాటలా? నన్ను.... ఎక్కడ సూసాడో సెప్పమను! ఎవరితో సూసాడు! సెప్పమను! మొగుడు - మొగుడట - పైసా సంపాదన లేకపోయినా సిన్న పిల్లోడికి సాకిరి సేసినట్టు సేసుకొత్తున్నాను! నాలుగిళ్ళలో... పాసి పనులు సేసి గడుపుతున్నాను! సాలదా? నాకు రంకు కడతాడా! సిగ్గులేదూ!" ఆత్మాభిమానంతో రెచ్చిపోయింది కాసులమ్మ!**

"ఆడి కాలు సెయ్యి బాగున్నప్పుడు సంపాదించలేదా? పెట్టలేదా?"

"ఏం తెచ్చాడు! సావాపుగాళ్ళకు ఖర్చులు పెట్టడానికే సరిపోయింది!" ముక్కు వత్తుకుంది కాసులమ్మ!

"ఆడి మనసు నీకు తెలియదంటే! కాలులేక, సంపాదన లేక, ఆడదాని మీద బతుకుతున్నానన్న బాధ! అలా అది బయటకు వస్తాది సూడు! ఎనకాల కుర్రోడు ఉన్నాడు. మీరు దెబ్బలాడుకు మనస్సు బాధపడతాది కాస్త ఆదుమొగం సూడండి!"

"నేను ఏమైనా సంపాదించి పెట్టమన్నానా? ఎక్కడ పని వుంటే.. అక్కడకన్న నేనే పోతున్నాను. నేనూ ఆడదాన్నే కదా!" ఆమెలో దుఃఖం కట్టలు త్రెంచుకుని వచ్చింది!

"ఈ టీ తాగే పిల్లా! ముఖం తిరుగుతుంది. నేను ఆడిని కేకలేస్తానులే!" అంటూ ఆమె టీ గ్లాసు అందించింది. వరసకు పిన్ని.

కాసులమ్మ అర్ధరాత్రి నుంచి బాధతో, కసితో, రగిలిపోతూ వుంది. తను చేసిన తప్పు, ప్రక్కింటి ఆవిడ సిన్మాకు తీసుకుపోతే వెంబడి వెళ్ళడం!

బ్లాకులో టిక్కెటు అమ్ముడు పోలేదని, తల్లికి రెండు టిక్కెట్లు ఇచ్చాడు! ఆమె తోడుగా కాసులమ్మని తీసుకుపోయింది.

ఈ విషయమై భార్యాభర్తల మధ్యన మాటా మాటా పెరిగి గొడవ పడ్డారు. ఒకరికొకరు దెప్పుకున్నారు!... తిట్టుకున్నారు!

అభిమానవతి కాసులమ్మ రెచ్చిపోయింది తెల్లార్లు చూరుక్రింద అరుగుపైనే కూర్చుంది. తను పడుతున్న కష్టం, నష్టం అన్ని గుర్తుకు రాసాగాయి. కన్నీరు ఆగలేదు!

"నువ్వలా ఏడుస్తుంటే పిల్లాడు బిక్కమొగం పెట్టాడు, ఆడా పిచ్చోడిలా కూర్చున్నాడు! ఎల్లి - పాచి చెయ్యి. నేను కుర్రోడికి ఏదో ఒకటి పెట్టి బడికి పంపుతానులే!"

సమయం గడిచే కొద్దీ కాసులమ్మ మనస్సు మెత్తబడింది. బాధ్యతలు గుర్తుకొచ్చాయి. లేచి మొఖం చెంగుతో వత్తుకుంది. ఏడేళ్ళ కొడుకును స్నానానికి రెక్కపట్టుకొని పెరటిలోకి లాక్కెళ్ళింది. రౌడీ గొడవల్లో కాలు పోగొట్టుకున్న ఆమె భర్త రాములు. అతడి మనస్సు పరిపరి విధాల కొట్టుమిట్టాడసాగింది. ఆ రాత్రి తాను అలా ప్రవర్తించి ఉండకూడదని నొచ్చుకున్నాడు.

అప్పుడప్పుడు వంటరివాడు అయిపోతున్నందుకు బెంగ, ఎందుకు గాకుండా పనీ పాట లేకుండా ఆడదాని సంపాదనపై బ్రతుకుతున్నందుకు తనపై తనకే కసి! ద్వేషం! పెళ్ళయిన తరువాత కాసులమ్మ ఏమి సుఖపడింది? కనుకా? ఏమి చేసినా భరించింది, తాగినా, తిరిగినా... సంపాదన యిచ్చినా.. యివ్వకపోయినా సర్దుకుపోసాగింది!

కాలు విరిగినప్పుడు అన్నీ తానై ఎంతో సేవలు చేసింది. ఇవన్నీ అతనికి గుర్తుకొచ్చి, కళ్ళలో నీళ్ళు గిర్రున తిరిగాయి. మేనత్త భుజం మీద తలవాల్చి, కన్నీళ్ళు కార్చాడు రాములు.



ఆ దృశ్యం చూసిన కాసులమ్మ చలించిపోయింది. కన్నీరు కార్చింది, ప్రక్కనే ఉన్న టీ కొట్టుకు వెళ్ళి, టీ తెచ్చి భర్తకు యిచ్చి, పిన్ని ప్రక్కన దిగాలుగా కూర్చుంది.

... ... ...

నిండు ముత్తైదువ! ఇంత కుంకుమబొట్టు పెట్టుకొని పమిట నిండుగా కప్పుకొని – కాసులమ్మ, భర్త కొబ్బరి బోండాల తోపుడు బండికి ఎదురొచ్చింది. ఉదయం ఆరున్నర నుంచి ఆ బండికి అలంకరణ చేసింది. పసుపు పూసి, కుంకుమబొట్టు పెట్టి, దిష్టి తగలకుండా నిమ్మకాయలు కట్టింది. వీధుల్లో బోండాలు అమ్మడానికి భర్తను సిద్ధం చేసింది.

అతని మేనత్త భర్త మార్కెట్‌లో ముఠా మేస్త్రి. అతని సిఫార్సుతో, హోల్‌సేల్ మార్కెట్ యజమానితో మాట్లాడి కొబ్బరి బోండాలు ఏర్పాటు చేశాడు.

అవిటితనం వల్ల ఎటూ తిరగనవసరం లేకుండా, ప్రభుత్వ ఆసుపత్రి సమీపంలో ఆ కొబ్బరి బోండాలు బండి పెట్టించాడు!

ఆ ఏడాదిలోనే విశాలమయ్యాయి రోడ్లు! రోడ్లకు ఇరువైపుల ఉండే బడ్డీ కొట్లు తొలగించారు. కొన్ని ఇళ్ళు ఆక్రమణలు కూడా ధ్వంసం అయ్యాయి.

సుమారు వంద సంవత్సరాల నుండి ఉన్న వృక్షాలు పెళ్ళగించారు. గత్యంతరం లేక చిరు వ్యాపారులు, చెట్టుకొకరు పుట్టకొకరు చెదిరిపోయారు. నీడనివ్వని ప్రాంతం కాకపోవడంతో కొంతమంది చిల్లర వ్యాపారులు సెంటర్లు మార్చుకున్నారు.

రాములు ఆ ప్రాంతంలో మిగిలిన ఒకే ఒక చెట్టు క్రింద కొబ్బరి బోండాలు వ్యాపారంలో సెటిల్ అయ్యాడు.

... ... ...

ఈ రోజు ఉదయం నుండి వచ్చిపోయే రోగులకు పది బోండాలు అమ్మాడు, సాయంత్రానికి మరో యాభై అయినా అమ్మాలి. దూరంగా ప్రభుత్వం కేటాయించిన స్థలంలో పూరంత "షాపింగ్‌మాల్!" తయారయిపోయింది. రెండు, మూడు రోజుల్లో మొదలవుతుంది. జనం రద్దీ పెరిగితే, తన బోండాల వ్యాపారం బాగుంటుంది, కుర్రవాడిని కాన్వెంట్‌లో చదివించవచ్చు.

బండి అద్దె ఇరవై, బీటు కానిస్టేబుల్‌కు పది, అవిగాక నెలకు తనపై రాసే రెండు కేసుల్లో ఈ రోజు ఒకటి, కోర్టులో యాభై కట్టాలి. వెళ్ళకపోతే పెనాల్టీ! ఇరవై కలపాలి. అన్నీ పోను తనకు మిగిలేది యాభై!

సంపాదన ఎంతని కాదు. తాను అవిటివాడు కాదు. జీవితంతో పోరాడగలననే ఆత్మవిశ్వాసం వచ్చింది, అదే అతని కొండంత అండ!

ప్రతీ రోజు కాసులమ్మ భర్తకు భోజనం తెస్తుంది. ఆ చెట్టు నీడలో భోజనం పెట్టి, భర్తకు విశ్రాంతి ఇస్తుంది. ఆమె కొబ్బరి బోండాలు చెక్కడంలో కత్తి పట్టి నైపుణ్యం కూడా సంపాదించింది.

... ... ...

ఉరుములు ఉరిమినట్లు, పిడుగు పడినట్లు, తుఫాన్ విరుచుకు పడినట్లు, ట్రైనీ ఎస్సై జీపు వచ్చింది. వచ్చీ రావడంతోనే కొబ్బరి బోండాల బండిని రెండు చేతులతో తిరగేశాడు. కానిస్టేబుల్స్ లాఠీలతో సిద్ధమయ్యారు.

"రోడ్లపై ఎక్కడా ఇలాంటి బళ్ళు కనపడకూడదు! ట్రాఫిక్ న్యూసెన్స్ గా మారిపోయింది. కనిపించినవాడినల్లా స్టేషన్‌కు తీసుకురండి!" అన్నాడు ఎస్సై.

కాసులమ్మ త్రుళ్ళిపడింది. చెట్టునీడలో వున్న రాములు ఉలిక్కిపడ్డాడు!

కొబ్బరి బోండాలు చెల్లాచెదురయ్యాయి. కోపంతో ముందుకు ఉరికాడు రాముడు. దొర్లిపోతున్న బోండాలు ఏరుకోవడానికి కాసులమ్మ పరుగుతీసింది.

రోడ్లపై చిల్లర వ్యాపారులతో ట్రాఫిక్‌కు అంతరాయం కల్గుతుందని, పోలీసులు ఆరోపణ, దాష్టీకాలు ఎక్కువ అయ్యాయి. ప్రతీ నెలా కేసులు రాస్తున్నా సరే!

"మమ్మల్ని ఏ గోదాట్లోకి పొమ్మంటావు" , కట్టడి చెయ్యడానికి సముదాయింపుగా దగ్గరగా వెళ్ళింది. హడావుడి చేస్తున్న పోలీసులపై మెటికలు విరిచింది – జీపు వెళ్ళిపోయింది.

రాములుకు తల తీసినంత పని అయ్యింది. కొబ్బరి బోండాలు కాబట్టి సరిపోయింది! పచ్చి సరుకు ఐతే? – ఇదే గతం అయితే మరోమారు జైలుకు వెళ్ళేవాడు. ఈ సంఘటనతో కంగుతున్నాడు. ఇంకా తేరుకోలేదు.

విషయం చెప్పి డబ్బులు కట్టడానికి హోల్‌సేల్ మార్కెట్‌కు చంకలో కర్ర పెట్టుకుని, అతి కష్టంగా బండిని త్రోసుకుంటూ పోయాడు.

అప్పటికే అక్కడికి అనేకమంది సాటి బళ్ళ వాళ్ళు చేరుకున్నారు. సుమారు రెండు వందల బళ్ళు. విరిగిన బళ్ళు! మట్టి

# నానీలు

- వి. వెంకటేష్
సెల్ : 9490508206



మంచినీళ్ళదిప్పుడు
మంచి వ్యాపార సందర్భం
ప్రపంచీకరణ...!
పగలబడి నవ్వుతోంది...!

ఆధునిక పోకడ
అర్థాయుశ్శే...!
పాత పంటల జాతరే
ప్రాణ వాయువు..!

పల్లెలు కరుగుతున్నవి
పట్నాలు పెరుగుతున్నవి
దేశానికి పల్లె సీమలు
పట్టుగొమ్మలట...!

నోటితో నవ్వు
నొసటితో వెక్కిరింపు
కాల మనుష్యులు
అంతేమరి...!

రోజు రోజుకి
కొత్త పుంతల్లో "సైన్స్"
సన్నాసులవింకా
సన్నాయి నొక్కులే...!

శ్రమ, పట్టుదల, లక్ష్యం
మన చుట్టాలైతే...!
జయం... ఇంటి ముందు
జే..గంటలు మ్రోగిస్తది

ఈర్ష్య, కుళ్ళు, కుతంత్రం
మనిషి నావరిస్తే...!
మానవత్వం, మనిషితనం
మరుగుజ్జే...!

అవ్వ హఠాన్మరణం
తాత గుండె ఆగింది
దశాబ్దాల 'ఆత్మీయ'
అనుబంధం మరి

'కవనం' సాగాలి
పది కాలాలు పదిలంగా
కడగాలి అజ్ఞానాన్ని
ఈ జగానా...!

---

కొట్టుకుపోయిన పళ్ళు, కాయగూరలు అమ్మేవాళ్ళ సైకిళ్ళు, తాను ఒక్కడే కాదు నష్టపోయింది.

ఆ కుటుంబాల పరిస్థితి ఏమిటి? రాములు వంట్లో ఉద్రేకం పెరిగిపోయింది. ఏమైనా సరే... ఈ... సమస్యను విడిచి పెట్టకూడదు. నిజానికి తాను వంటరి కాదు. ఇంత శక్తి వుందని అర్థమైన తర్వాత కార్యాచరణ తీసుకోకుండా ప్రకృతి విరుద్ధంగా అణగారిపోతుందా?

"స్టేషన్ దగ్గరే తేల్చుకుందాం పదండి!!" అన్నారు ఎవరో!!

"అందరూ బళ్ళు తీయండి..!" రాములు కేక వేశాడు.

స్టేషన్ ముందు ట్రాఫిక్ స్తంభించిపోయింది. అంతా గొడవ గొడవ, పెద్ద కోలాహలం - ఆరంభమయ్యింది. పోలీసు చర్య వ్యతిరేకంగా నినదించారు.

విషయం తెలిసిన జిల్లా అధికారులు అక్కడకు చేరుకున్నారు.

బాధితులందరూ కలిసి సమస్యను అధికారులకు విన్నవించుకున్నారు. ఇలా అయితే కొన్ని వందల మందికి ఉపాధి పోతుంది! ప్రజలకు తాజా సరుకులు గుమ్మం ముందు అందిస్తున్నాం! మమ్మల్ని నేరస్తుల్ని చేస్తే ఎలా? నెల నెలా కేసులు రాస్తున్నారు కదా! మారుమూల వీధుల్లోనూ ట్రాఫిక్ సమస్య అంటే అర్థం ఏమిటి? ఈ ప్రశ్నలు అధికారి ముందు ఉంచారు!

సమస్యలను పరిష్కరించడానికి వ్యవధి పడుతుందని, మీ యాజమాన్యాలతో చర్చించి, త్వరలో న్యాయం చేకూర్చగలనని ఉన్నత అధికారి వాగ్దానం చేశాడు.

మౌనంగా ఒక్కొక్కరు ఇళ్ళకు వెళ్ళిపోయారు.

ఇంతవరకూ చిన్న చిన్న ఒడిదుడుకులు వచ్చినా సర్దుకు పోయేవి, ఆసీలు వాళ్ళు చిన్న చిన్న మామూళ్ళ కేసులు తప్పించి, మరేమి ఇబ్బంది లేదు. కాని ఈ వేళ సంఘటనతో ఆ చిల్లర వ్యాపారుల పరిస్థితి ప్రశ్నార్థకంగా మారింది. ఈ ఊరులోనే ఇంతమంది ఉంటే ఈ దేశం మొత్తంపై తనలాంటి చిల్లర వర్తకులు లక్షలలోనే ఉండవచ్చని స్మరించి రాములు దంపతుల మనస్సు కలతతో నిద్రపట్టలేదు.

హోల్‌సేల్ వర్తకులు, బళ్ళకు సరుకులు ఇవ్వడం లేదని, మొత్తం సరుకులు లారీలలో లోడు చేస్తున్నారని తెల్లారి వార్త!!

పేటలో తనతో పాటు వ్యాపారం చేస్తున్న ఇద్దర్ని తన వెంట తీసుకుపోయాడు రాములు.

అప్పటికే... అక్కడ చాలామంది చేరుకున్నారు. గుంపులు గుంపులుగా చర్చ సాగుతూ వుంది. కొందరు ధైర్యం చేసి, తమ యజమానులను నిలదీశారు. కాని తెలివిగా కథ అడ్డం తిప్పారు.

"మాకు చెల్లించవలసిన పాత బకాయిలు రద్దు చేస్తున్నాం. మీరు నిశ్చింతగా ఉండండి." వర్తకులు సమస్యల నిప్పులపై నీళ్ళు చల్లారు. కొంతమందితో ఈ ప్రతిపాదన బాగానే ఉందనిపించారు.

సిటీలో వున్న షాపింగ్‌మాల్స్ యజమానులకు హోల్‌సేల్‌గా సరుకులు సప్లై చేసే యజమానులకు మధ్య శాశ్వత ఒప్పందం కుదిరింది. ఇక మీదట నాణ్యమైన, పళ్ళు, కాయగూరలు, షాపింగ్‌మాల్సుకు నేరుగా సప్లై చేస్తారట!

మిగిలిన నాసిరకం సరుకులు బళ్ళ మీద చిల్లరగా అమ్ముకోవడానికి తక్కువ ధరకే ఇస్తారట. పైగా వూళ్ళో కాకుండా శివార్ల ప్రాంతాలలో అమ్ముకోవాలి. ఇది వారి ప్రతిపాదన. కుదిరిన ఒప్పందంలో ముఖ్యమైన విషయాలు... గత రాత్రే ఓ కుట్ర జరిగిందని రాములు గ్రహించాడు.

వ్యాపార సంబంధాల పాత్రే రాజ్యమేలుతున్నప్పుడు బడుగు జీవులు మనుగడ గూర్చి తామే నిర్ణయించుకోవలసి వస్తే... ఎదురయ్యే ప్రశ్న రాములు ముందు నిలిచిపోయింది...!!!

# ఫ్లోరోసిస్ మీద

# కసిగా ఎత్తిన కవితా ఖడ్గం

- భూపతి వెంకటేశ్వర్లు




నిరంతరంగా వెంటాడుతు వచ్చిన ఒక తీవ్ర ఆవేదనల సారమీ దీర్ఘ కవిత. ఎటూ మెసలనివ్వక, అదేపనిగా సలుపుతూ వచ్చే విషమ సమస్య కిది అక్షర రూపం. అధిగమించజాలని, అదిమి పట్టలేని విలయమంటే ఇదే. అంతటి తీరని ఆర్తిని లోకాలకు అవగతం గావించే కృషి ఫలితవే ఈ కావ్యం. ఆయాసంతో రొప్పుతూ, కవి అణచివేయజాలని కసితో వున్నట్లు ఫ్లోరోసిస్... ఫ్లోరోసిస్ అంటూ ఒక పెద్ద ఆర్తనాదం చేశాడు. పుస్తకం విప్పుతూనే బోన్సాయి స్వగతం లోకి మనల్ని విసురుగా కొనిపోతూ సాంకేతికంగా ఎదిగినా, ప్రపంచీకరణ పేరుతో ప్రపంచమంతా ఓ కుగ్రామంగా మారిందన్నా, సామాన్య జనజీవనాలను కబళించే ఫ్లోరోసిస్ సర్పాన్ని నియంత్రించలేని శాస్త్రీయ సాంకేతిక పరిజ్ఞానం, స్వార్థ విషపూరిత రాజకీయ ఎత్తుగడలకు నిరసనగా ఈ చిన్న కావ్యం జనఘోషలా వినిపించాలని ఆరాటపడు తున్నానంటూ ఆక్రోశిస్తాడు. అనితరసాధ్యంగా, తన వృత్తి ధర్మ నిర్వహణలో భాగంగా కర్నూలు జిల్లా జొన్నగిరి ప్రాంతంలో బంగారు నిక్షేపాలు కనుగొన్నందుకు ఏకంగా భారత ప్రభుత్వం నుంచి, 2000 సం॥లో జాతీయ ఖనిజ పురస్కారాన్ని అందుకుని మాత్రం ప్రయోజన మేమిటని ఒక కవిగా ఒక భూగర్భ పరిశోధకుడిగా విస్తుపోయి కనిపిస్తాడు. అంతకంతకూ ఎదగడమే కాని అంతం లేదనిపిస్తున్న ఈ 21వ శతాబ్దపు విషాదమ్మీద కసితో పిడికిలి బిగిస్తూ వస్తున్నాడు.

ఒక్క నల్లగొండ జిల్లాలోనే 36 మండలాలకు విస్తరించి, 850 గ్రామాల్ని చుట్టేసి, ఎనిమిది లక్షలకు పైగా జనాభాను చిత్రహింసలకు మించి అరిగోస పెడుతూ వచ్చిన ఘోరాన్ని మన కళ్ళ ముందుంచుతూ కవి, ఫ్లోరోసిస్ చేత కాటు వేయబడిన దీనుల నికృష్ట స్థితిని, ముఖ్యంగా నిప్పుల ఎడారై నిలిచిన తెలంగాణాను కనుగొనమని, కనికరం చూపే పరిష్కారాలను వేగిరపరచడం అనివార్యమని హెచ్చరిస్తున్నాడు. ఒక్క నల్లగొండ జిల్లాయే కాదు, ఇటువంటి మరే జిల్లా అయినా, ఇతర రాష్ట్రమేదైనా ఫ్లోరోసిస్‌కు గురైందంటే అది మృత్యుతుల్యమేనని ఘోషిస్తున్నాడు. ఈ భూమి మీద పడగానే తల్లి ఒడిలోని భద్రతను కాక మృత్యువు ఒడిలో భాగంగా జీవితాలను లాగుకొస్తున్న విధివంచితులకు ఈ కవితను అంకితమిస్తున్నానని వినమ్రంగా మనవి చేసుకుంటున్నాడు.

ఏమాయె ఏమాయె నల్లగొండ. బతుకు వీణ తంత్రులు తెగిపడినట్లు ముడిపడిన పేగులాయె అంటూ ప్రారంభమవుతుంది కవితా కహాని. నల్లగొండ పట్టణంలోని వీధి వీధి వచ్చేపోయే ప్రతి దారీ, లతీఫ్ షావలీ, అక్క చెలమ కోనేరు మొదలు, అమ్మకంటికి ఎండిన కన్నీటి చారల జాడలను కనుగొంటూ వస్తాడు, గాయపడిన గుండె దుఃఖాశ్రువుల ఆనవాళ్ళను ఆరాతీస్తూ నిలుస్తాడు. చుక్క చుక్క నీటి కోసం (స్వచ్ఛమైన నీరన్న సంగతి విశేషించి చెప్పనవసరం లేదు కదా) చిన్నబోయిన బిందెలను చూపిస్తాడు. కాటుపడిన బతుకుల పాటును చూపి గుండెలు బాదుకుంటాడు.

వంకర తేలి, విరగకుండానే వేళ్ళాడుతున్న కాళ్ళు, చేతులను, పసుపుగార పట్టిన పళ్ళనూ దీనాతిదీనంగా చూసే కళ్ళనూ చూడమంటూ, నిశ్శబ్దపు కుబుసంగా ఫ్లోరోసిస్ ఎలా జనుల మీదకి సర్రున జారుతూ విస్తరిస్తుందో పసిగట్టమంటాడు. తట్టలోన పెట్టుకొని చాటలోన ఎత్తుకొని ఎగుడు దిగుడు బతుకు బాటలోని నడవలేని నడకాయె / ఏమాయె! ఏమాయె! అని కవి నిలదీస్తున్నప్పుడు, చదువరుల ఒంటిమీది చర్మం వొలుచుకుంటూ పోయినంత బాధగా, పరమ అసహ్యంగా తట్టక ఇంకేమౌతుంది?

ఒకచోట కవి దీనంగా, జాలి చూపులు చూస్తూన్నట్టు పానుగంటి నాథుడు పడమగంటి పవ్వళించేనా ఉదయ సముద్రం నేడు బురద అంటుగట్టేనా అని నిలదీస్తాడు. ఇక్కడి బిడ్డల రేపటి బతుకుల నిండా నిండిపోతున్న నిప్పుల ఎడారి సెగలను లెక్కిస్తాడు కవి. ఇక్కడి ప్రాంతాల నొక్కటొక్కటిగా ఏకరువు పెట్టుకుంటూ, జిల్లాలోనే అత్యధికంగా ఫ్లోరోసిస్ గ్రామమైన శివ్వన్నగూడెం మొదలు ఎల్లారెడ్డిగూడెం, మరింకొకటి, వేరొకటి అంటూ పల్లె పల్లెనూ, ప్రతి గూడాన్నీ తెచ్చి చూపుతూ, వాటి వెనకాల దాగిన ద్రోహుల మర్మాన్నీ చిత్రిక పడతాడు.

బాధల కాక్‌టేల్ మింగి, వివశులైపోయిన ఇక్కడి ప్రాంతాల మనుషులు, చావు గుప్పిట్లో మునిగి తేలుతున్న ఇక్కడి వాళ్ళు మాత్రం ఏమవుతూ వచ్చినా, వాళ్ళు దిక్కులనీ, వాళ్ళ పలుకులు రుక్కులనీ సగర్వంగా చాటిన ఈ కవి కన్నవారి కంటిలోన కానరాని నలుసులుగా మిగిలిపోవటాన్నీ శపిస్తాడు. ఇక్కడే కవిగా రూప్‌కుమార్ శక్తీ, సామర్థ్యం

# అడుగుల జెండాలు

- శ్రీనాగాస్త్ర
సెల్ : 9640317108

గండు చీమలు
బెబ్బులులై
కోరమీసాల్ని దువ్వాయి

తంగేడు పూలు
తేనెటీగలై
ఈటెలు దూశాయి

వేపచెట్లు
పోలేరమ్మలై
పూనకాలాడాయి

మట్టిపుట్టలు
నల్లత్రాచులై
బుసలుకొట్టాయి

వాగులు
ఉరుములై
వీరహుంకారములురిమినాయి



గులకరాళ్ళు
ఫిరంగిగుళ్ళై
వడిసెల్తో
పరుగులెట్టినాయి

తుమ్మెదలు
బూరగొమ్ములై
రేలాగీతాలాలపించాయి

బేకాలు
డంకాలై
రణ నినాదాలు గర్జించాయి

తాటి మట్టలు
తల్వారులై
తెల్లతోళ్ళు ఒలిచాయి

తిప్ప తీగలు
ఉచ్చులై
సీమ దొరల పీకల్ని కోశాయి

అడవి బిడ్డలు
మిరప టపాసులై
బ్రిటిషు చెరసాలల్ని కూల్చారు

అయోధ్య సీతారాముడి పాదములు
తాకి శాప విమోచనొందిన అహల్య
శిలలా పడివున్న కీకారణ్యం కాదిది

అల్లూరి సీతారామరాజు అడుగుల్ని ముద్దాడిన
వట్టి వెర్రికోయలు శూరవీర గిరిపుత్రులై
అడవి అంగరక్షకులుగా తిరగబడ్డ మన్యమిది

---

# పక్షి

హిందీ మూలం : హరివంశ్‌రాయ్ బచ్చన్
తెలుగు : డాక్టర్ పేరిశెట్టి శ్రీనివాసరావు
సెల్ : 9989242343



పక్షితో అన్నాను నేను...
'నీపై కవిత రాయాలనుకుంటున్నాను'
పక్షి ఇలా అడిగింది నన్ను...
'నీ శబ్దాలకి నా రెక్కల సౌందర్యమున్నదా?
అన్నాను నేనిలా...'లేదు'
'నీ శబ్దాలకి నా కంఠ మాధుర్యమున్నదా?'
'లేదు'
'నీ శబ్దాలకి నా రెక్కల చప్పుదున్నదా?'
'లేదు'
'పోనీ జీవమున్నదా?'
'లేదు'
'మరి నువ్వు నాపై కవిత ఏం వ్రాస్తావు?'
'అప్పుడు అన్నాను నేనిలా...'
'కానీ నీపై నాకు ప్రేమ వున్నది.'

---

గోచరిస్తాయి. స్వప్న శబ్దాన్ని పట్టుకోగలడు గనుకనే ఆర్తి గలిగి మసలుకుంటాడు. అట్లా చేస్తాడు గనుకనే అపసవ్యాల మీద, దూర్తవర్తనుల మీద విరుచుకుపడతాడు. పైన నిశ్చల నిర్మలంగా అగుపించే ఈ కవి కవితల గర్భమంతా మహా సముద్రాలంతటి తీవ్రతరమే, తీక్షణ రుక్కే. ఎవరి జీవితం నిండా ఆకాశమంతటి విషాదం పరుచుకుందో, వారి ప్రతి రోజూ రెండుమారులు పలకరించే నల్లటి నీడ అంటున్నప్పుడు ఒక్క పెట్టున బతుకుంతా కుప్పకూలిన వైనంగా అనిపిస్తుంది. ప్రయాణంలో బాటసారులై కలసినట్లే కలుస్తున్నాయి. అయినా విడివిడిగా నడుస్తున్నాయి అంటున్నప్పుడు మనుష్య కోటిని తునాతునకలు చేసి ప్రసాదం కింద భోంచేయబూనిన కిరాతకుల వాసనగా తడుతుంది.

ఇంతటి దిగులు గాయాల ఒళ్ళును గురించి ఇంతగా ఎవరూ ఏకరువు పెట్టలేదేమో. బతుకునిండా భవిష్యత్ భయాలే చోటు చేసుకున్నప్పుడిక అదీ బతుకేనా చావు ఇంతకన్నా భయంకరమైనదేనా అన్న ప్రశ్నలు కాక మరేం కలుగుతాయి. సమస్య తీవ్రత నాసాంతం అర్థం చేసుకున్నాడు గనుకనే పల్లె పచ్చదనమెరుగని అడవి ఒక మాయ అని సాధికారంగా ప్రకటించగలిగాడు. కాలి కమిలిన చర్మం డప్పుకే సొంతం అని గుర్తించాడు గనుకనే చీకటి సిగలోన విప్పపూల నినాదం అంటూ మొలవనున్న పిడికిళ్ళ మహోగ్ర సాహసాన్ని, అనివార్య తనూ వ్యాపింపచేశాడు. అట్లా చేశాడు గనుకనే శబ్దాన్ని, అంకుశమై అన్నీ ప్రతీప శక్తుల్నీ ధ్వంసం చేయగల శక్తి స్వరూపాన్ని లోక సాక్షాత్కారం గావించాడు. కవి, అట్లా అనేకాల్ని లోక విదితం గావిస్తూ, అంతిమంగా జీవన గీతాలను పాడుకుంటాం అన్నంతటి ఆత్మోన్నత భరోసాకు ఆస్కారమిస్తాడు. ఇక మా రక్తంతోనే మా గాయాలకు మలాం అద్దుకుంటాం అంటూనే జన్మనిచ్చిన ధాత్రికే తిరిగి అంకితమవుతాం అంటూనే మరింత మహిమాన్వితంగా ప్రభవించి ప్రభాసించనున్నామని ధ్వనింపచేయడంలో ఈ కవి అసాధారణ సృజనకు ఒక ఆకారంగా, అపూర్వంగా నిలిచాడని సంభావించవచ్చును.

రచయిత సెల్ : 9490098343

# వేమన్న పద్యాల్లోని భాషా సంపదకు ప్రతిబింబం

- ఎం. నారాయణశర్మ




తెలుగు సాహిత్యంలోనే ఆటవెలదికి ఒక ఉదాత్తమైన చారిత్రక సౌందర్యాన్ని అద్దిన కవి వేమన. ఆటవెలదిని అనుసరించి పద్యరచన చేసినవారు వేమనకు ముందు వెనుక కాలాల్లో వున్నా ఆటవెలది విషయంలో వేమన పొందిన సాధికారత, తెలుగు సీమని జాగృతం చేసింది. ఒక కోణంలో ఆలోచిస్తే తెలుగు సాహిత్యంలోనే ఆటవెలదికి ఒక చరిత్ర ఉందనేది శోధించాల్సిన విషయం. వేమన తరువాత కూడా వేమన పద్ధతిలోనే అనేక శతక సుమాలు వికసించాయి. నిర్మాణగతంగా వేమన చూపిన మార్గం అలాంటిది.

వేమనపై పిహెచ్‌డి పట్టా కోసం పరిశోధన చేసిన ఆచార్య ఎన్.గోపి, పరిశోధనకు ముందు వెనుకల్లో కూడా వేమనకు సంబంధించిన అత్యంత కీలక సమాచారాన్ని మరిన్ని రచనల ద్వారా అందించారు. వేమన్నవాదం, ప్రజాకవి వేమన, పారీస్ ప్రతి, ఇతర వ్యాసాల తరువాత 'వేమన్న వెలుగులు' పేరిట వేమన పద్యాలకు విశ్లేషణ నందిస్తున్నారు డా॥ గోపి. వేమన్నవాదంలో వ్యాఖ్యాన నైశిత్యం, ప్రజాకవి వేమనలో పరిశోధన కనిపిస్తే ఇందులో డా॥ గోపిలోని పండితుడు కనిపిస్తాడు. సుమారు మూడు సంవత్సరాల పాటు ధారావాహికంగా వచ్చిన విశ్లేషణా పరంపరకు గ్రంథ రూపం ఇది.

ఈ గ్రంథంలో రచయిత విశ్లేషణా పటిమను కొన్ని అంశాల ద్వారా దర్శించవచ్చు.

1. పాఠాంతరాల వివరణ
2. పదాలు, ప్రయోగాల వివరణ
3. దేశీపదాల వ్యవహారాన్ని పోల్చగలిగే సామెతలు, జాతీయాల ఉటంకింపు
4. పరిభాషని ఉపయోగించినప్పుడు పూర్తి వివరణ ఇవ్వటం
5. సమాంతరంగా అనిపించే సంస్కృత శ్లోకాలు. ఇతర దాక్షిణాత్య భాషల పద్యాల ఉటంకింపు.

తొలి కాలం నుండి ఇప్పటికి ఎందరో పండితులు వేమనపై పరిశోధనలు చేశారు. ఆ మార్గంలో అనేకమైన పాఠాంతరాలు కనిపిస్తాయి. అలాంటి సందర్భంలో శుద్ధ ప్రతి, వాక్యం ఎత్తిరాయటం, అన్ని పాఠాంతరాలను చర్చించడం కనిపిస్తాయి. ఒక్కో పద్యానికి ఒక పాదంలోనే మూడు నాలుగు రూపాంతరాలుండటం గమనార్హం.

"అంతరంగమందు అద్వైతియై యుండు / బాహ్యమందు ద్వైత భావముగను / అట్లుగాక తత్వమలవడ నేరదు' (పే.5) ఈ పద్యానికి ఆయన చూపిన పాఠాంతరాలు గమనిస్తే ఎన్నిటిని పరిశీలించారో అర్థమవుతుంది. "తలప తలపమానై తగులుగాక / బాహ్యరంగమందు భాషింపనేలయా" (పే. 1723. 281) అలం) బాహ్యమందు శివుని పాటించీ నిలుచురా (పి. 1725-281) అంతరంగమందు అభిధనుద్యోగించి - బాహ్యరంగమందు బాధింప నిలుచునా (పే. 1769-932) నిలుప నిలువక మాడ్కి నిలుచు గాక (పే. 5) ఒకటి రెండు పాఠాంతరాలున్నవీ కనిపిస్తాయి. పదాలు పదబంధాలను విశ్లేషించే సందర్భాలూ ఎక్కువే.

"తాళకంబెరుగరో తగరంబు నెరుగరో" (పే. 74) అన్న ప్రయోగాల్లో 'తగరం' అనే పదాన్ని విశ్లేషిస్తూ 'వంగ', 'సత్తు' 'తమరం', అనే పర్యాయాలనం. దానికి సంబంధించి 'తగరము పొడి చేసి వెడతాపగి నాకడ బీరగాడుగా బొగడిడు' అనే ప్రయోగాన్ని చెప్పి 'తాళకం' గురించి గైరికము, హరిదళం వంటి పర్యాయాలను "ఎరిసనిక్ సల్ఫైడ్" వంటి రసాయన శాస్త్ర పరిభాషను చెబుతారు.

'అమృత మాది రుచుల హస్తమే మెరుగును (పే. 175) అన్న చోట 'హస్తం' అనే పదపు సామాన్య వ్యవహారం. హస్తం అంటే చెయ్యి ఆకారంలో ఉండే గరిటె, తెడ్డు అంటారు. "ఎక్కడైనా ఆశలినుమడి యుండగా' (పే. 89) అన్న చోట 'ఇనుమడి' అన్న పదాన్ని దాక్షిణాత్య భాషల వారసత్వ పదం నుండి తెలుగులో ఉన్న రూపాంతరాలనూ వివరిస్తారు.

"ఇనుమడి అంటే రెట్టింపు, ఇన్మడి, ఇబ్బడి, ఇమ్మడి అనేవి రూపాలు. కన్నడంలో ఇమ్మడి, ఇర్మడి అంటారు. ఇను అంటే రెండు ఇరు అంటే కూడా ఇరు+నూరు 'ఇన్నూరు' (ఫైదే) మరికొన్ని చోట్ల

# చీకటి సూరీడు

- ఎస్. బాలసుధాకర్‌మౌళి
సెల్ : 9676493680



ఎవరండి
ఆ చీకట్లో
లోకం నిద్దరోయిన వాకిట్లో
వెలుతురు కన్ను తెరచుకొని
నగరాన్ని పరీక్షగా చూస్తున్నది
కాలాన్ని ప్రశ్నిస్తుంది
ఆ నల్లని రూపం ఎవరిదండి!

ఓహో!
క్రిమికీటకాదులు కూడా
పవళించిన ప్రశాంత వాతావరణంలో
ఇంటి పెంపుడు కుక్క కూడా
మొరగడం మానేసి
గుర్రుపెట్టి నిద్రిస్తున్న అర్థరాత్రి వేళ
కర్తవ్య నిర్వహణలో నిబద్ధతతో పనిచేస్తున్నదెవరండి
ఎవరండి
నగరం 'రణగొణ ధ్వనులు' స్తంభించిన
నిశీధి వేళలో
ఉదయాస్తమయాలు చూడని కర్మాగారాలు
విశ్రమించిన విశ్రాంతి కాలంలో
ఎవరండి
ఆ నిశాచర జీవి
ఎవరండీ ఆ నిశాచర జీవి!
నిద్రాదేవత నీడను కూడా
ఊరి పొలిమేరల్లోకి తోలేసినట్లు
నిశ్చింతగా వున్నట్లున్న ఆ ఆకారం ఎవరిదండి!

పాకిస్తాన్ బోర్డర్‌లో
ఎ.కె. 47తో
పహారా కాస్తున్న ఇండియన్ సైనికునిదా
అరుణాచల్ ప్రదేశ్‌లో
సూర్యుని ఆగమనాన్ని
వేయి కళ్ళతో ఆహ్వానిస్తున్న ప్రకృతి ఆరాధకునిదా
ఎవరండి!
చరిత్ర చీకటి కోణాల్ని దృశ్యీకరిస్తున్న చిత్రకారుడా
పరిశోధనలో తలమునకలైయున్న సైంటిస్టుగారా
అయ్యో...
ఎవరండి... ఎవరండి...
ఇన్‌సోమ్నియాతో బాధపడుతున్న ముసలివాడా
యుద్ధంలో దారితప్పిన పశ్చిమాసియా పౌరుడా
ఇంతకీ ఎవరండీ ఆ మౌన సంభాషి!
చీకటి దుప్పట్లో ఇల్లాలి ముఖాన్ని వెతుక్కుంటూ
సుదీర్ఘంగా భవిష్యత్‌ను స్వప్నిస్తూ
ఆకలి ఉలితో చీకటి క్రౌర్యాన్ని ఛేధిస్తూ
వేకువ అంతర్జీవికను స్పర్శిస్తూ
ఎవరండి!
ఎవరండి!
ఎవరో కాదండి
మరెవరో కాదండి
లోకం సుప్తావస్థలోకి జారుకున్న వేళ
బతుకు పోరులో దూకేవాడు
అలుపులేని పోరాటాన్ని సలుపుతున్నవాడు
నిశిరాత్రుల్లో నెల జీతానికి పనిచేస్తూ
కుటుంబాన్ని నెట్టుకొస్తున్న గజ ఈతగాడు
చీకటి సూరీడు
ఇంకెవరో కాదండి 'కాపలాదారుడండి'!

---

కూడు + అదేమి... బొందికి + అట్టే 'బొందికట్టె' లాంటి వాడుక భాషా ప్రయోగాలు వివరిస్తారు.

పరిభాషని వివరిస్తున్నప్పుడు 'అవురు' 'దర్భ' అనే పదాలను వివరించిన పద్ధతి దాని ఉపయోగానికి గల వైశాల్యాన్ని చూపుతుంది. వేమన పద్యాల్లోనే అనంతమైన దేశీ పద సంపద కనిపిస్తుంది.

వేమనకే గాదు చాలామంది సంస్కృత కవులకు, ఆధునిక కవులకు, సాహితీ జీవులందరికీ సమాజమే ఆకరం. అందువల్లే చాలావరకు సమాంతరత కనిపిస్తుంది. ఈ దగ్గరితనాన్ని పోల్చిన సందర్భాలూ ఈ విశ్లేషణా క్రమంలో అనేకంగా ఉన్నాయి. "ప్రస్తుతంపు వేళ పద్యంబు చదివిన / తప్పు గలిగియున్న నొప్పియందు / వెలది సురతవేళ బిత్తవై యుండదా (పే. 348) అనే పద్యానికి జగన్నాథుని ప్రసంగ రత్నావళిలోని శ్లోకానికి సారూప్యతని చూపుతారు.

"అవసర పఠితావాణి / గుణ గణ రహితాహి వహతి పరిమోదం / రతి సమయే యువతీనాం / భూషాహానిశ్చ భూషణం భావతి " (పైదే) అవధీ భాషలోని కవితా వాక్యాల సారూప్యతలు చెప్పిన సందర్భాలూ ఉన్నాయి. "మక్కకు జననేల" అనే పద్యాన్ని వివరిస్తూ 'కబీరు' రాసిన వాక్యాన్ని చూపిస్తారు.

"కాకర్ పాతర్ జోడికై మస్జీద్‌లయ్ ఓబనాయ్ / తాపేముల్లా బాంగ్‌దీ క్యా బహురాహో ఆఖుదాయ్" (పే 404)

వేమన పద్యాలని కేవలం నీతిపాఠాలుగా చూసే క్రమం ఎక్కువ. తరచి చూస్తే వేమనలో అనేకమైన సంప్రదాయ, రాజకీయ, వైదిక పరిభాష, దేశీ పద సంపద కనిపిస్తాయి. డా॥ గోపి విశ్లేషణ చూసిన తరువాత వేమన భాషా సంపదపై పరిశోధన రావల్సిన అవసరం కనిపిస్తుంది. అది అచ్చ తెలుగు ఉన్నతికి దోహం చేస్తుంది.

సెల్ : 9848348502

# ఉప తీర్పులో ఉపదేశం

- తెలకపల్లి రవి

రాష్ట్ర రాజకీయ రంగంలో కొత్త ప్రాంతీయ పార్టీ ఆవిర్భవించింది. గత ముప్పయ్యేళ్ళ లోనూ రాష్ట్రాన్ని పాలిస్తున్న రెండు ప్రధాన పార్టీలైన తెలుగుదేశం, కాంగ్రెస్‌ల సరసన మరో ప్రాంతీయ కాంగ్రెస్ వెలసింది. నిన్నటి బంగ్లా కాంగ్రెస్, ఉత్కళ కాంగ్రెస్, కేరళ కాంగ్రెస్, తమిళ మానిల కాంగ్రెస్ - నేటి తృణమూల్ కాంగ్రెస్, నేషనలిస్టు కాంగ్రెస్ వంటి పార్టీలకు మరొకటి తోడైంది. దాని భవిష్యత్తు ముందు ముందు తేలాలి, ఏమైనా సిబిఐ కేసులు, అరెస్టులు, ఆరోపణల నేపథ్యం వున్నా జగన్ అభ్యర్థులను ఎన్నుకున్నారు. అంతమాత్రానే ఈ విజయంతో ప్రజలు ఆయనపై ఆరోపణలన్ని తోసిపుచ్చారనీ, అవినీతిని బేఖాతరు చేశారని అనడం తొందరపాటు.

**త**ప్పులెన్నువారు తమ తప్పులెరుగరని వేమన చెప్పినట్లు ప్రజాస్వామ్యంలో ప్రజలను తప్పుపట్టడం అన్నిటికన్నా సులభం. పార్లమెంట్ స్థానంతో కలిపి 19 చోట్ల జరిగిన ఉప ఎన్నికల ఫలితాల తర్వాత ప్రజానీకంపై నిందాపూర్వక వ్యాఖ్యలు చేసేవారిని చూస్తే ఆ పద్యం గుర్తు వస్తుంది. జగన్‌మోహన్‌రెడ్డి అవినీతి వ్యవహారాలను ప్రజలు పట్టించుకోలేదని ఓడినవారు అంటుంటే అవినీతి ఆరోపణల దర్యాప్తును ప్రజలు తిరస్కరించారని వైఎస్‌ఆర్ కాంగ్రెస్ నేతలు వర్ణిస్తున్నారు. ఈ రెండు చిత్రణలూ ఓటేసిన నేపథ్యాన్ని సరిగ్గా చూపించడం లేదు. నిజానికి ఈ ఫలితాలు ఊహించనివీ కావు. చాలా సర్వేలలో చెప్పినవే. మొత్తంపైన వైఎస్‌ఆర్ కాంగ్రెస్ లేదా జగన్ పార్టీ అభ్యర్థులు 16 స్థానాల్లో విజయం, ఎక్కువ చోట్ల భారీ మెజారిటీలు సాధించారు. రాష్ట్ర రాజకీయ రంగంలో కొత్త ప్రాంతీయ పార్టీ ఆవిర్భవించింది. గత ముప్పయ్యేళ్ళ లోనూ రాష్ట్రాన్ని పాలిస్తున్న రెండు ప్రధాన పార్టీలైన తెలుగుదేశం, కాంగ్రెస్‌ల సరసన మరో ప్రాంతీయ కాంగ్రెస్ వెలసింది. నిన్నటి బంగ్లా కాంగ్రెస్, ఉత్కళ కాంగ్రెస్, కేరళ కాంగ్రెస్, తమిళ మానిల కాంగ్రెస్ - నేటి తృణమూల్ కాంగ్రెస్, నేషనలిస్టు కాంగ్రెస్ వంటి పార్టీలకు మరొకటి తోడైంది. దాని భవిష్యత్తు ముందు ముందు తేలాలి, ఏమైనా సిబిఐ కేసులు, అరెస్టులు, ఆరోపణల నేపథ్యం వున్నా జగన్ అభ్యర్థులను ఎన్నుకున్నారు. అంతమాత్రానే ఈ విజయంతో ప్రజలు ఆయనపై ఆరోపణలన్ని తోసిపుచ్చారనీ, అవినీతిని బేఖాతరు చేశారని అనడం తొందరపాటు. వైఎస్‌ఆర్ కాంగ్రెస్ గత రెండేళ్ళుగా చెబుతూ వస్తున్న విషయాలు చేస్తున్న సామాజిక సమీకరణలు వేరు. కాంగ్రెస్‌కు దన్నుగా నిలిచిన సామాజిక శక్తులకు సంక్షేమ పథకాల పేరిట రాజశేఖరరెడ్డితో మమేకమైన పేద వర్గాలకు తామే అధికారానికి అసలైన వారసులం అని ఆ కుటుంబం నచ్చజెప్పగలిగింది. జగన్ నిర్విరామ ఓదార్పు యాత్రల సారాంశం అదే. ఆ శ్రమ వూరికే పోలేదని ఫలితాలు చెబుతున్నాయి. ఈ కారణంగానే ఆయన అరెస్టు ప్రతికూలతకు గాక అనుకూల తీర్పులకే దోహదం చేసింది. ఈసారి వరకూ కాంగ్రెస్ స్థానంలో జగన్ పార్టీని ఓటర్లు స్వీకరించారు. ప్రభుత్వ నిర్వాకాలపై, రాష్ట్రంలో రాజకీయ అనిశ్చితిపై పరిపాలనా ప్రతిష్టంభనపై ప్రజలు అసంతృప్తి, ఆగ్రహం ఈ తీర్పులో దాగివున్నాయి. కనుక కేవలం సానుభూతినో మహిళల కన్నీళ్ళ వల్లనో గెలిచారని, లేక ప్రజలు తప్పుగా తీర్పునిచ్చారని అంటే అది పాక్షికతే అవుతుంది.

ప్రాథమికంగా ఇది కాంగ్రెస్‌కు తిరస్కృతి. రెంటిని మినహాయిస్తే తక్కిన అన్ని చోట్ల పాలకపక్షం తన స్థానాలు కోల్పోయింది. (ఆ రెండు చోట్ల చిరంజీవి మాజీ పిఆర్‌పి ప్రభావం వుందంటున్నారు). శంకరరావు, దివాకరరెడ్డి వంటి పార్టీ నాయకులు భిన్న స్వరాలు వినిపించడం మొదలుపెట్టారు. మంత్రి మాణిక్య వరప్రసాద్ ఒక విధమైన పునర్వ్యవస్థీకరణ గురించి మాట్లాడారు. సమన్వయ కమిటీల సమావేశాలు సమర్థనతో ముగిశాయి. మేధోమథనం జరగాలన్న ప్రతిపాదనలు, హాలాహలం పుడుతుందనే భయంతో నిజరూపం దాల్చడం లేదు. మహబూబ్‌నగర్‌లో ఘర్షణల వంటివి చూస్తే అంతఃకలహాలు విజృంభించే అవకాశాలు పుష్కలం. ఈ ఓటమిని అవకాశంగా తీసుకుని కిరణ్ వ్యతిరేక వర్గం దుమారం లేవదీసే అవకాశాలు కూడా ఎక్కువ. ఎందుకంటే అది కాంగ్రెస్ సంస్కృతి.

కాంగ్రెస్ ఇంత వ్యతిరేకతను ఎదుర్కొంటున్నా తెలుగుదేశం ఓటింగ్ పెరగలేదంటే అది కూడా ఎంతటి సంక్షోభంలో వున్నదీ తెలుస్తుంది. అహోరాత్రులు అవిరామంగా ప్రచారం చేసిన చంద్రబాబు నాయుడు ఇవి మా స్థానాలు కావు అని చేసిన వాదన అతికేది కాదు. ఎంతగా పెనుగులాడినా ఆ పార్టీ ఓటర్ల విశ్వసనీయత పొందలేదన్నది స్పష్టం. వారు బాగా ఆశలు పెట్టుకున్న స్థానాల్లోనే దారుణంగా దెబ్బతిన్నారు. దానికి కారణాలు వెతక్కుండా ఓటర్ల విజ్ఞతను ప్రశ్నించడం, అవినీతిని పట్టించుకోవడం లేదని ఆవేదన చెందడం అర్థరహితం. అవతలివారు అవినీతిపై నిప్పులు కురిపించేసినంత మాత్రాన ఓట్లు వచ్చి కురుస్తాయా? అటు టిఆర్‌ఎస్‌కు, ఇటు జగన్ పార్టీకి తమ వారు వలసలు పోతుంటే నివారించలేని దురవస్థ ఎందుకు కలిగింది? విధానపరంగానూ, యంత్రాంగపరంగానూ, నాయకత్వ రీత్యానూ లోతైన ఆత్మపరిశీలన చేసుకోకపోతే తెలుగుదేశం పరిస్థితి దిగజారుతుందే గానీ మెరుగవదు.

సిపిఎం పోటీ చేసిన చోట్ల చాలా పరిమితంగా ఓట్లు వచ్చాయి. అయితే బరిలో అది స్వంతంగా నిలబడటం గుర్తించబడింది.

దానితో అవగాహనకు వచ్చిన లోక్‌సత్తా ఓటింగ్ ఇంకా తక్కువగా వుంది. ఇక సిపిఐ తెలుగుదేశంకు మద్దతు ఇచ్చినా ఫలితం దక్కలేదు. అలాగే మహబూబ్‌నగర్ ముచ్చటలో తెలంగాణపై బిజెపి ఆశలు పరకాలతో పటాపంచలైనాయి. పరకాలలో సురేఖ ఇచ్చిన పోటీని బట్టి చూస్తే తెలంగాణలో ఏకసూత్ర రాజకీయాలే ఎల్లకాలం చెల్లవని టిఆర్‌ఎస్ తెలుసుకోవలసి వచ్చింది. అయితే ఫలితాలు వచ్చీ

రాకముందే కాంగ్రెస్ నేతలు ప్రాంతాలవారీ ప్రహసనం మరోసారి తీవ్రం చేయడం గత రాజకీయాల కొనసాగింపేనని చెప్పాలి.

ఈ రెండేళ్ళలోనూ జగన్ తెలంగాణ అనే రెండు అంశాల చుట్టూనే రాష్ట్రంలో రాజకీయాలను పరిభ్రమింపచేశారు. జగన్‌ను ముఖ్యమంత్రిని చేయాలని మొదట్లో సంతకాలు చేసినప్పటి నుంచి సిబిఐ అరెస్టు వరకూ చూస్తే కాంగ్రెస్ నేతల మంత్రుల పోకడలు చిత్రచిత్రంగా మారాయి. వైఎస్ మృతదేహం వుండగానే సంతకాల సేకరణ అనే వారు తాము కూడా సంతకాలు చేశామన్న మాట చెప్పరు. అధిష్టానం ఆమోదిస్తుందనుకుని దస్కత్తులు పెట్టారు. జరగదని తేలాక స్వరం మార్చారు. అది భరించలేని జగన్ తనకే వారసత్వ పీఠం దక్కాలన్న తపనతో కొనసాగారు. తన ఆర్థిక రాజకీయ సామ్రాజ్యాన్ని కాపాడుకోవడానికి స్వంత వ్యవస్థ అవసరమని, లేకపోతే నిలబడనీయరని గట్టిగా భావించినందునే ఓదార్పును ఒక సాధనంగా ఎంచుకున్నారు. కులం, ధనం ప్రధాన పాత్ర వహించే ప్రస్తుత పరిస్థితుల్లో ఆయనకు అనుకూలంగానూ, వ్యతిరకంగానూ శక్తుల సమీకరణ జరిగింది. ఇదంతా కళ్ళ ముందు జరిగిన ఇటీవలి క్రమం. తెలంగాణా సమస్యలో అస్పష్ట వైఖరితో పదే పదే తిరస్కరణకు గురైన తెలుగుదేశం ఇతరత్రా కూడా ప్రజానుకూల ప్రత్యామ్నాయ విధానాలను ముందుకు తేలేకపోయింది. ఎంతసేపూ తమ పాలన స్వర్ణయుగమని పొగుడుకోవడం, ఇతరుల అవినీతిపై, అసమర్థతపై దండకాలు చదవడం తప్ప ఆత్మవిమర్శ లేకుండా పోయింది. కాంగ్రెస్‌ను తలపించే రీతిలో తెలుగుదేశంలోనూ అసమ్మతి రాగాలు, అత్యున్నత స్థాయిలో అంతర్గత కలహాలు శాసనసభ్యుల వలసలు కనిపించాయి.

***ఈ రెండేళ్ళలోనూ జగన్ , తెలంగాణ అనే రెండు అంశాల చుట్టూనే రాష్ట్రంలో రాజకీయాలను పరిభ్రమింపచేశారు. జగన్‌ను ముఖ్యమంత్రిని చేయాలని మొదట్లో సంతకాలు చేసినప్పటి నుంచి సిబిఐ అరెస్టు వరకూ చూస్తే కాంగ్రెస్ నేతల మంత్రుల పోకడలు చిత్రచిత్రంగా మారాయి. వైఎస్ మృతదేహం వుండగానే సంతకాల సేకరణ అనే వారు తాము కూడా సంతకాలు చేశామన్న మాట చెప్పరు. అధిష్టానం ఆమోదిస్తుందనుకుని దస్కత్తులు పెట్టారు. జరగదని తేలాక స్వరం మార్చారు. అది భరించలేని జగన్ తనకే వారసత్వ పీఠం దక్కాలన్న తపనతో కొనసాగారు.***

వాస్తవానికి తెలుగుదేశం కూడా జగన్ వ్యూహాలను మొదట చూసీచూడనట్లు ఉపేక్షించింది. తర్వాతే దాడి పెంచింది. 2009లో ప్రచురించిన అవినీతి ఆరోపణలనే అది కేంద్రబిందువుగా చేసుకున్నా ఆమూలాగ్రం అవినీతిభరితమై పోతున్న ప్రస్తుత ప్రపంచీకరణ శకంలోనూ అంతకుముందు కూడా అవినీతి ఒక్కటే ప్రజల తీర్పులను శాసించిన దాఖలాలు లేవు. దానికి ఇతర అంశాలు తోడవ్వాలి. కనుకనే ఏకసూత్ర అవినీతి ఎజెండా ఫలించలేదంటే అదే కారణం. అయినా శంకరరావు తర్వాత తెలుగుదేశం నేతలు కూడా చేరి నడిపించిన కేసులో దర్యాప్తునకు ఆదేశించడంతో రాజకీయాలు మలుపు తిరిగాయి. ఇందుకు విరుగుడుగా విజయమ్మ చంద్రబాబుపై కేసు వేసి కొంత పురోగతి సాధించినా తర్వాత పగ్గాలు పడ్డాయి. కడప ఉప ఎన్నికలలో అఖండ విజయం. ఆలస్యంగా వచ్చిన తెలుగుదేశం అవిశ్వాస తీర్మానానికి సమర్థన. అంతకంటే ఆలస్యంగా వారిపై అనర్హత వేటు. ఆ తర్వాత మరింత ఆలస్యంగా - సరిగ్గా ఉప ఎన్నికల ముందు జగన్ అరెస్టు ఈ ప్రక్రియను ఒకే దారిలో నడిపించాయని చెప్పాలి. ఇందులోని చిక్కుముడులను, ఇతర కోణాలను తెలుగుదేశం గుర్తించలేదు. కాంగ్రెస్ కావాలనే దాటేసింది. ఎలా స్పందించాలో తెలియని అయోమయం దాన్ని చాలా కాలం వెంటాడింది.

లిక్కర్ సిండికేట్‌పై ఎసిబి జరిపిన దాడులు ముఖ్యమంత్రి కిరణ్‌కు పిసిసి అధ్యక్షుడైన మంత్రి బొత్సకు మధ్య రాజకీయ యుద్ధంగా మారాయి. దాన్ని సర్దుబాటు చేసుకోవడానికి అధిష్టానం మాఫియా కేసులనే మాఫీ చేసేందుకు సిద్ధమైన విపరీత పరిస్థితి. జగన్‌పై అవినీతి ఆరోపణల దర్యాప్తును హర్షించే వారైనా ప్రభుత్వ ద్వంద్వ నీతిని ప్రశ్నించాల్సి వచ్చింది. పైగా ఆ కేసులోనూ మంత్రులకు బాధ్యత విషయంలో కాంగ్రెస్ నాయకత్వం వెనుకాడితే చివరకు ఒక్కరే జైలుకు పోవలసి వచ్చింది. ఈ వైరుధ్యాలకు తోడు ప్రజలపై భారాల మోత, పరిపాలన స్తంభన అన్నిటినీ మించి తెలంగాణ సమస్యపై దాగుడు మూతలు షరా మామూలే.

ఇలాంటి పరిస్థితులలో జగన్ గట్టిగా నిలబడతాడన్న నిరాధార ప్రచారం వైఎస్ఆర్ పార్టీ వ్యూహాత్మకంగానూ, ఉధృతంగానూ సాగించింది. పాశ్చాత్య దేశాల తరహాలో వృత్తిపరమైన ప్రచార నైపుణ్యం ప్రదర్శించారు. ఆయనపై ఆరోపణలన్నీ అసత్యాలని, అరెస్టు కక్ష సాధింపేనని నిరంతరాయంగా ప్రచారం నడిపించింది. సరిగ్గా ఉప ఎన్నికల ముందు అరెస్టు చేయడంలో రాజకీయాల ప్రభావం వుందని సిబిఐ గత చరిత్రను బట్టి ఆరోపించే అవకాశం వారికి కలిగింది. దీనికి తోడు కాంగ్రెస్ నేతలను, మంత్రులను (ఒక్కరు మినహా) సలహాదారులను అంటుకోకపోవడం అనుమానాలు పెంచింది. అతను మాతో వుంటే మహాయోగం పట్టేదని కేంద్ర కాంగ్రెస్ నాయకులు అనడం అపహాస్యం పాలైంది. జగన్‌పై ఆశలు లేదా భ్రమలు ప్రస్తుతానికి పై చేయి సాధించాయంటే అధికారంలో వున్న వారిపై అసంతృప్తి ప్రధాన కారణం.

మామూలుగానే ఒక పాలక పార్టీ మరొకసారి వరుసగా గెలవడం చాలా కష్టం. ప్రభుత్వంపై వ్యతిరేకత. ప్రధాన ప్రతిపక్షంపై అవిశ్వాసం వల్ల ప్రజలు తమకు వేసిన ఓట్లను తమపై ఆరోపణల తిరస్కరణగా వైఎస్ఆర్ పార్టీ చెప్పుకుంటే అది పెద్ద పొరపాటు అవుతుంది. వారికే నష్టం కలిగిస్తుంది. పైగా వారు ఆశించిన స్థాయిలో వలసలు జరగలేదు గనుక మరింత కాలం పార్టీని అలాగే నిలబెట్టుకోవడం వారి ముందున్న పెద్ద సవాలు. న్యాయస్థానాల విచారణ సిబిఐ దర్యాప్తు ఎలా సాగుతాయో కూడా తెలియదు. కనుక జగన్ పార్టీ తమ నిజమైన రాజకీయం ఇప్పుడే మొదలైందని గుర్తించాలి. వారితో సహా అందరూ ప్రజల సమస్యల పరిష్కారం ప్రధానంగా చేసుకున్న రాజకీయ ఎజెండా ముందుకు తీసుకురావడం ప్రజా వ్యతిరేక ధోరణులను ద్వంద్వ రాజకీయాలను విడనాడటం సర్కారు ముందున్న తక్షణ కర్తవ్యాలు. వామపక్షాలు కూడా తమ పునాదిని విస్తరించుకోవడంపై దృష్టి పెట్టాలని ప్రజాస్వామ్య ప్రియులు కోరుకుంటారు. మున్ముందుగా ప్రాంతీయ సమస్యను ప్రజ్వలింపచేసే ప్రయత్నాలు కట్టిపెట్టి సహేతుక పరిష్కారంతో కూడిన సమగ్ర ప్రకటన సూటిగా చేయడం ఈ రాష్ట్రానికి చాలా చాలా అవసరమైన శాంతికి మొదటి అడుగు.

**(జూన్ 21 ఆంధ్రజ్యోతి సౌజన్యంతో)** ■

# కొత్త పుస్తకాలు




## సాహిత్య సౌరభం

- డా॥ కనుపర్తి విజయబక్ష్

వెల : రూ.70/- పేజీలు : 96

**ప్రతులకు : 94413 82303**

ప్రముఖులైన సాహితీవేత్తలు సృజించిన రచనల విశ్లేషణకే పరిమితం కాకుండా రచయిత్రి వర్తమాన సాహిత్యంలో వెర్రితలలు వేస్తున్న అనేక పెడ ధోరణులను తీవ్రంగా విమర్శించారు. ముఖ్యంగా పాఠకుల ఆలోచనలను చిత్ర విచిత్రమైన స్కీములతోనూ, క్విజ్‌లతోనూ పక్కదారి పట్టిస్తున్న పత్రికల నుంచీ, సృజనాత్మక ప్రతిభ లేకపోయినా, వాయిదాల పద్ధతి మీద రచనలను తయారు చేస్తున్న వ్యాపార రచయితల నుంచీ సాహిత్యాన్ని కాపాడుకోవలసిన కర్తవ్యాన్ని పాఠకులకు గుర్తుచేశారు.

**- అదృష్ట దీపక్**

---




## వెన్నెల కుప్పలు (కథలు)

- చొప్పదండి సుధాకర్

వెల : రూ.70/- పేజీలు : 112

**ప్రతులకు : 9948859889**

ఆత్మవంచనా, పరవంచనా మన దైనందిన జీవితాల్లోకి, మనకు తెలియకుండానే చొచ్చుకు వచ్చి వాస్తవాన్ని పక్కవక్కలకు నెట్టి వేయటాన్ని ఒక సిద్ధాంతంగా కాకుండా - ఒక వాస్తవంగా - ఇందులోని కథల్లో మనం గుర్తిస్తాం...! మిథ్యా వాతావరణం అని తెలిసి కూడా - అందులోకి చొచ్చుకుపోయి, అది మిథ్య కానే కాదనీ- 'అదే వాస్తవం' అనీ, తనను తాను నమ్మించుకునేందుకు మనిషి పడుతున్న మథనాన్ని చొప్పదండి సుధాకర్ కథల్లో మనం గుర్తిస్తాం..!

**- జీడిగుంట రామచంద్రమూర్తి**

---




## ప్రతిభా దర్శనం

- డా॥ జె. బాపురెడ్డి

వెల : రూ.250/- పేజీలు : 248

**ప్రతులకు : 040-24744580**

**(విశాలాంధ్ర బుక్‌హౌస్ అన్ని బ్రాంచీలు)**

ఈ "ప్రతిభా దర్శనం" వ్యాస సంపుటి నా సుదీర్ఘ సాహితీ యాత్రలో ఒక రచయితగా, కవిగా ముఖ్యంగా పాఠకుడుగా తెలుసుకున్న విషయాలను సాటి పాఠకులతో పంచుకోవాలనుకున్న ఆకాంక్షకు అక్షర రూపం. ఇది ప్రతిభాకృతులను వినమ్రంగా మీకు ప్రయోజనకరంగా, స్ఫూర్తిదాయకంగా ఉపకరిస్తాయనే సత్సంకల్పంతో చేసిన ప్రయోగమిది.

**- డా॥ జె. బాపురెడ్డి**

---




## మట్టిసౌరు (కవితా సంపుటి)

- నమిలకొండ నాగేశ్వర్‌రావు

వెల : అమూల్యము పేజీలు : 32

**ప్రతులకు : 94400 88437**

అప్పుడప్పుడు రాసినప్పటికీ ఈ కవిత్వంలో సాంద్రత హెచ్చు కోటబుల్ కాగలిగే కవిత్వమే నిలుస్తుందని, నినాదంగా నుడికారంగా సామెతగా మారగలిగే కవిత్వమే శతాబ్దాలుగా కొనసాగుతుందని దిగంబరకవి నగ్నముని ఎప్పుడో అన్నట్టు గుర్తు. ఇందులోని కవిత్వం కరీంనగర్ మట్టిసౌరుతో పాటు విశ్వవ్యాప్త మానవీయ స్వభావాలను, విశ్వప్రేమను వ్యక్తం చేస్తుంది. సార్వజనీన సత్యాలను వెలికితీసి కవిత్వీకరించిన తీరు మహాకవులకు తీసిపోదని అనేక చరణాలు సాక్ష్యమిస్తాయి.

**- బి.ఎస్. రాములు**

---



## ఎర్ర మందార మకరందం

(కవితా సంపుటి)

- కె. ప్రభాకర్

వెల : రూ.100/- పేజీలు : 116

**ప్రతులకు : 9440136665**

కె. ప్రభాకర్ రాసిన ఎర్రమందార మకరందం కవితా సంకలనం చూశాను. మిగతా విషయాలు ఎట్లా వున్నా, వాడిన భాష తీరు నాకు బాగా నచ్చింది. ముఖ్యంగా భాష విషయంలో ప్రత్యేకమైన శ్రద్ధ చూపెట్టినట్లు కనిపిస్తుంది. పదాలు, అర్థాలు సరిపోతూనే పదాల్లో ప్రత్యేక శ్రద్ధ చూపించి ఒకదాని నుంచి మరొక సహజంగా మారడానికి శ్రద్ధ చూపించినట్లుంది.

**- చేరా**

---




## కవిత్వం

### గాలిరంగు (కవిత్వం)

- దేవిప్రియ

వెల : లేదు పేజీలు : 98

మన బతుకు, మన సీమ, మన పలుకు, మన లోతు, మన వైశాల్యం, మన చుట్టూ చూపు - ఇవే మనకి రూపురేఖలిస్తాయి. రెండు తేలిక మాటలు చెప్పి, నాలుగు అలవోక వాక్యాలు రాసి సరిపెట్టాలనుకుని, ఇలా ముగిస్తున్నాను. ఒకటి మాత్రం వాస్తవమే. నా కవిత్వాన్ని నేను పరిచయం చేయలేను. నా కవిత్వమే నన్ను పరిచయం చేయాలి.

**- దేవిప్రియ**

# ఔత్సాహిక కవుల్లో ఆత్మవిశ్వాసం నింపిన కవిత్వ శిక్షణా శిబిరం



కవిత్వ శిక్షణా శిబిరంలో సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి ప్రారంభోపన్యాసం. చిత్రంలో మోతుకూరి నరహరి, కె. ఆనందాచారి, అద్దేపల్లి రామమోహనరావు, జి. యాదగిరిరావు, సీతారాం, పిల్లలమర్రి రాములు

ఇటీవల వచన కవితలు రాసే వారి సంఖ్య బాగా పెరిగింది. ఇది సంతోషం కలిగించే విషయమైనా కవితల నాణ్యత అసంతృప్తి కలిగిస్తుంది. సామాజిక సమస్యలను, వర్తమాన సంఘటనలను కవితా వస్తువుగా తీసుకోవడం కూడా సానుకూలమైన అంశమే. అయితే సదరు కవితా వస్తువును శక్తివంతంగా వ్యక్తీకరించడంలో ఈనాటి కవులు విఫలమవుతున్నారు. వివిధ పత్రికలలో విరివిగా వస్తున్న కవితలు పరిశీలిస్తున్నప్పుడు పైన తెలిపిన అభిప్రాయాలు కలుగుతున్నాయి. పలువురు సాహిత్యవేత్తలు, విమర్శకులు కూడా పై అభిప్రాయాలను తరచూ వ్యక్తం చేస్తూనే ఉంటారు. గతంతో పోలిస్తే అక్షరాస్యత పెరిగింది. చదివే వారి సంఖ్య పెరిగింది. అందుకు తగ్గట్టుగా దినపత్రికలలో సాహిత్య శీర్షికలు నిర్వహిస్తున్నారు. ప్రత్యేకంగా సాహిత్య పత్రికలు కూడా ఇటీవల పెరిగాయి. దాంతో ప్రచురణావకాశాలు కూడా పెరిగాయి. ప్రభుత్వరంగ సంస్థలు, ఎల్‌ఐసి వంటి సంస్థలలో పనిచేసేవారు, ఉపాధ్యాయులు వంటి మధ్యతరగతి ప్రజలకు ఆర్థిక సౌలభ్యం ఉండడంతో స్వయంగా పుస్తకాలు వేసుకునే అవకాశం కూడా కలిగింది. రచన చేయడానికి ఇవన్నీ ప్రోత్సాహం కలిగించే అంశాలే. ముఖ్యంగా వచన కవిత్వం ఎటువంటి వ్యాకరణ సంకెళ్ళూ లేకుండా రాసే ప్రక్రియ కావడం వల్ల ఎక్కువమందిని ఆకర్షిస్తుంది. అందువల్ల వచన కవిత్వం మూడుపువ్వులు ఆరుకాయలుగా వర్ధిల్లుతుంది.

ఇది సంతోషించాల్సిన విషయమే. కాకపోతే మరోపక్క కొన్ని చెడు పరిణామాల వంటివి కూడా ఈ నేపథ్యంలో చోటుచేసుకుంటున్నాయి. రాసినది ఎలా ఉన్నా పుస్తకాలు వేసుకోవడం. ఆవిష్కరణ సభలు ఏర్పాటుచేసుకోవడం. సత్కారాలు, అవార్డులు వచ్చేలా చూసుకోవడం కూడా పెరిగింది. రచనా ప్రక్రియ కేవలం కీర్తి కోసం మాత్రమే అనే ధోరణిలో ఈ వ్యవహారం సాగుతుంది. కొన్ని సంస్థలు సత్కారాల కోసం, అవార్డులను కొనుగోలు పద్ధతిలో అందివ్వడం కోసం ఏర్పాటుచేయడం ఈ ధోరణికి పరాకాష్ట. రచన పట్ల, సమాజంలో భావాల వ్యాప్తిపట్ల అవగాహన, చిత్తశుద్ధి లేని కొందరు ఇటువంటి పోకడలు వ్యాప్తిచేస్తున్నారు.

ఏ రచన చేయాలన్నా కేవలం రాయాలన్న తపన ఉంటే సరిపోదు. గతంలో రాసిన వారి రచనలు చదవాలి. పరిశీలించాలి. అధ్యయనం చేయాలి. మేలైన రచనలు చేయాలంటే గత రచనలపై అవగాహన లేకపోతే సాధ్యం కాదు. ఈనాడు రాసే వారిలో ప్రధాన లోపం అధ్యయనం చేయకపోవడమే అనడంలో సందేహం లేదు. ఆ దిశగా ఔత్సాహిక రచయితలకు మార్గదర్శకత్వం చేయాల్సిన బాధ్యత సాహిత్య సంస్థలు, సీనియర్ రచయితలపై ఉంది. ఈ నేపథ్యంలో సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ హైదరాబాద్‌లోని సుందరయ్య విజ్ఞానకేంద్రంలో నిర్వహించిన 'కవిత్వ శిక్షణా తరగతులు' విజయవంతమయ్యాయి. ఇటువంటి కార్యక్రమాల అవసరాన్ని మరింతగా చాటిచెప్పాయి. సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ జూన్ 3న సుందరయ్య విజ్ఞానకేంద్రంలో 'కవిత్వ శిక్షణా తరగతులు' నిర్వహించింది. ఉదయం 10 గంటల నుండి రాత్రి 8 గంటల వరకు జరిగిన ఈ కార్యక్రమంలో ఆద్యంతం కవులు ఆసక్తిగా పాల్గొన్నారు. సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి ఈ శిక్షణా తరగతులను ప్రారంభించారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ఇటీవల వస్తున్న కవితలు ప్రతిధ్వనులుగానే ఉంటున్నాయి కానీ స్వీయ రచనలుగా ఉండట్లేదని అన్నారు. ఇప్పటికే వచ్చిన కవిత్వాన్ని, సాహిత్యాన్ని అధ్యయనం చేయడం ద్వారానే ఒరిజినల్ రచనలు చేయగలుగుతారని అన్నారు. ఇటువంటి శిక్షణా తరగతులు అధ్యయనం పట్ల ఆసక్తి పెరగడానికి దోహదం చేస్తాయని అన్నారు. అనంతరం శిక్షణా కార్యక్రమం ప్రారంభమయ్యింది.

కేవలం హైదరాబాద్, రంగారెడ్డి జిల్లాలను దృష్టిలో పెట్టుకుని నిర్వహించిన ఈ కార్యక్రమంలో ఇతర జిల్లాల నుండి కూడా ఔత్సాహికులు పాల్గొన్నారంటే వారి ఆసక్తి తెలుస్తుంది. ముందుగానే పత్రికలలో ప్రకటించడంతో నేరుగానూ, ఫోనుద్వారానూ ఈ తరగతులలో పాల్గొనడానికి 120 మంది నమోదు చేయించుకున్నారు. వంద రూపాయలు ఫీజు చెల్లించి 80 మంది పూర్తిరోజు కార్యక్రమంలో పాల్గొన్నారు. చాలామంది ఔత్సాహిక కవులు మార్గదర్శకత్వం కోసం ఎదురుచూస్తున్నారని ఈ శిక్షణా తరగతులలో రుజువయ్యింది. ఈ కార్యక్రమంలో నాలుగు అంశాలు- ప్రాచీన కవిత్వం, కవిత్వం-వస్తురూపాలు, కవిత్వం-దృక్పథం, కవిత్వావరణం తరగతులను నిర్వహించడం జరిగింది. కేంద్రీయ విశ్వవిద్యాలయం తెలుగు విభాగం ఆచార్యులు డా. పిల్లలమర్రి రాములు ప్రాచీన కవిత్వాన్ని బోధించారు. సాహిత్య ప్రస్థానం సంపాదకవర్గ సభ్యులు, కవి, విమర్శకులు కె. ఆనందాచారి కవిత్వం-వస్తురూపాలు అంశాన్ని బోధించారు. ప్రముఖ కవి, విమర్శకులు అద్దేపల్లి రామమోహనరావు కవిత్వం-దృక్పథం అంశంపై బోధించారు. చివరి అంశం 'కవిత్వావరణం' పేరుతో కవితా నిర్మాణంపై వినూత్న రీతిలో ప్రముఖ కవి, విమర్శకులు డా. సీతారాం బోధించారు.

తరగతులకు హాజరయిన పలువురు ఔత్సాహిక కవులు తమ

సందేహాలను నివృత్తి చేసుకున్నారు. డా. సీతారాం తరగతిలో పాల్గొన్న కవులు అప్పటికప్పుడు కవితలను రాసి లోపాలను సరిదిద్దుకున్నారు. తరగతులను బోధించిన అధ్యాపకులు ఈ కార్యక్రమం ఏర్పాటుచేసినందుకు సాహితీస్రవంతి నగర కమిటీ సభ్యులను అభినందించారు. ముగింపు సభలో పాల్గొన్న విద్యార్థులు తమ స్పందనలను తెలిపారు. ఇటువంటి శిక్షణలను తమ కవితలను మెరుగుపరుస్తాయని తరచూ ఇటువంటి శిక్షణా కార్యక్రమాలు ఏర్పాటుచేయాలని వారు కోరారు. హాజరయిన విద్యార్థులందరికీ సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ సర్టిఫికెట్‌లు అందజేసింది. ఈ శిక్షణా తరగతులకు సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్ ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. సాహితీస్రవంతి నగర కమిటీ తరపున శాస్త్రి, తంగిరాల చక్రవర్తి, గేరా, శాంతిశ్రీ, వెంకటి, నరేష్, రాజాలు సమన్వయకర్తలుగా వ్యవహరించారు. సాహితీస్రవంతి నగర కమిటీ కార్యదర్శి జి. యాదగిరి రావు, లక్ష్మయ్య కార్యక్రమ నిర్వాహణ బాధ్యతలు చూశారు. రాష్ట్రమంతటా ఇటువంటి శిక్షణా శిబిరాల నిర్వహించడానికి తగిన ప్రేరణ ఈ కవిత్వ శిక్షణా శిబిరం కలిగించింది. ఈ కవిత్వ శిబిరంలో కవి సీతారాం ఇచ్చిన కవితా వస్తువుకు వెంటనే స్పందించి రాసిన కవితల్లో మూడు కవితలను ఈ దిగువ ప్రచురిస్తున్నాం.

\- వొరప్రసాద్

---

**కవిత్వ శిక్షణా శిబిరంలో రాసిన కవితలు**

## గుండె చిల్లులు

**- బండారు రమేష్**
**సెల్ : 9948828704**

ఉగ్గుపాలను రంగరించడంలో
లోపం చేయలేదు కదా తల్లీ!
చందమామను చూపించటంలో
లోపం చేయలేదు కదా తల్లీ!

ఒడి ఊయల కట్టడంలో
బడి బాటన నడపటంలో
లోపం చేయలేదు కదా తల్లీ!

తల్లీ ఇన్నాళ్ళూ...
మన ఇంటి సూరుకే చిల్లులుంటాయనుకున్నాను
మన ఒంటి గుడ్డకే చిల్లులుంటాయనకున్నాను
ఇవాళే తెలిసింది తల్లీ...
నా చిట్టితల్లి గుండెకూ ఉంటాయని చిల్లులు

---

## కన్నతల్లి గుండెకోత

**- ఎస్.వి. కిరణ్ కుమార్**
**సెల్ : 9440530859**

ఒక్క స్పర్శ చాలదా
కన్నబిడ్డ ప్రాణం నిలుపగ
ఒక్క ముద్దు చాలదా
ఆ బిడ్డ గుండె చిల్లు మూయగ
కన్నతల్లి స్పర్శతో
ప్రాణమే లేచిరాదా
యమపాశం పారిపోదా
గుండె రంధ్రం మూసుకోదా
దేవుడంటి వైద్యుడే
సందేహం నింపితే

అపనమ్మకంతో కూడిన
నమ్మకమే కలిగిస్తే
తల్లిడిల్లు తల్లిప్రేమ
తన బిడ్డను ముద్దాడితే
కనిపెంచిన ఆ పిచ్చితల్లి

చెమ్మగిల్లిన కళ్ళతో
కట్టలు తెగుతోన్న
కన్నీటి ఉప్పెనతో
తన గుండెలకత్తుకుని...
తన ఆయువు సైతం పోసుకొమ్మని
ఆ బిడ్డని దీవిస్తే
ఆ ఒక్క స్పర్శ చాలదా
కన్నబిడ్డ ప్రాణం నిలుపగా
ఆ ఒక్క ముద్దు చాలదా
ఆ బిడ్డ గుండె చిల్లు మూయగ

---

## అమ్మ బాధ

**- ఎస్. విజయలక్ష్మి**
**సెల్ : 9347426345**

ఆటపాటలతో
ఆడిపాడి మురిపించావు మరిపించావు
మన అనురాగానికి ఆ దేవునికి కన్ను కుట్టిందేమో
నీ గుండెల్లో గుచ్చాడు గునపాలు
పెట్టాడు రెండు చిల్లులు

సిరులొలికే నీ చిరునవ్వులకి
చిన్నబోయాడేమో

నీ గుండె దారులలో
సుడిగుండం పొంగింది
నా గుండెను పిండి
నీ గుండెకు రక్తాన్ని అందించాను

లోపమేదైనా నీకు శాపమయ్యింది
ఈ తల్లిని మన్నించు
నిన్ను నేను గెలుచుకుంటాను
నా ప్రాణాలను ఫణంగా పెట్టి
నిన్ను జీవింప చేసుకుంటాను
ఇదిగో నీ గుండెపై
నా రెండు కన్నీటి చుక్కలు..

**విజ్ఞప్తి**

# పుచ్చలపల్లి సుందరయ్య మ్యూజియం కోసం ఫోటోలు, లేఖలు, వ్యాసాలు పంపండి



పీడిత ప్రజల ప్రియతమ నాయకుడు కామ్రేడ్ పుచ్చలపల్లి సుందరయ్య శతజయంతి సంవత్సరం ఇది. భారత కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాతల్లో ఒకరిగా, దక్షిణ భారత కమ్యూనిస్టు ఉద్యమ ఆద్యులుగా, ఆంధ్రప్రదేశ్‌లో కమ్యూనిస్టు ఉద్యమ నిర్మాణంలో అగ్రగణ్యుడిగా కామ్రేడ్ సుందరయ్య చిరపరిచితులు. నిజాం నిరంకుశత్వానికి, జమీందార్ల, దేశముఖ్‌ల ఫ్యూడల్ దోపిడీకి వ్యతిరేకంగా జరిగిన చారిత్రాత్మక తెలంగాణా సాయుధ పోరాట నాయకుల్లో ముఖ్యుడు ఆయన. పార్లమెంటు, అసెంబ్లీలలో సైతం తన సేవలను ప్రజలకందించారు. నిరాడంబరతకు నిలువుటద్దం సుందరయ్య. అలాంటి మహామనీషి అతి సాధారణ ప్రజల నుండి, పార్టీ కార్యకర్తలు నాయకుల వరకు- అందరితోనూ ఎంతో సన్నిహిత సంబంధాలు నెరపేవారు.

ఆ మహానేత ఆశయాల వ్యాప్తికోసం హైదరాబాదులో నెలకొల్పబడిన సుందరయ్య విజ్ఞాన కేంద్రం గత రెండున్నర దశాబ్దాలుగా ఆ కృషిలో నిమగ్నమయి ఉంది. సుందరయ్యగారు వినియోగించిన వస్తువులు, ధరించిన దుస్తులు మొదలైన ఆయన స్మృతి చిహ్నాలు ఈ కేంద్రంలో భద్రపరచబడినాయి. వాటితో పాటు కొత్తగా సాధ్యమైనన్నింటిని సేకరించి నేటి తరానికి మార్గదర్శకంగా, భావి తరాలకు స్ఫూర్తి దాయకంగా సుందరయ్య మ్యూజియంను శాశ్వత ప్రాతిపదికన ఏర్పాటుచేయడానికి విజ్ఞాన కేంద్రం సంకల్పించింది.

కామ్రేడ్ సుందరయ్యతో ప్రత్యక్ష సంబంధం ఉన్నవారు పలువురు ఉన్నారు. అలాంటివారివద్ద, లేదా వారి కుటుంబ సభ్యులవద్ద సుందరయ్యగారిని గుర్తుచేసే ఫోటోలు, లేఖలు ఉండిఉండవచ్చు. ఆ రోజుల్లో ఆయన రాసిన వ్యాసాలు కూడ ఉండవచ్చు. సుందరయ్యగారిపై ఇతరులు రాసిన వ్యాసాలు కూడ ఉండే అవకాశం ఉంది. సుందరయ్యగారు తెలంగాణా పోరాటంలో పాల్గొన్న ఫోటోలు దాదాపు లేనేలేవు. అలాంటి అరుదైన ఫోటోలు కూడ కొందరి వద్ద ఉండవచ్చు. వ్యక్తుల వద్దనే కాదు సంస్థల వద్ద కూడ ఉంటాయి.

అమూల్యమైన వాటిని సుందరయ్య విజ్ఞాన కేంద్రానికి పంపించినట్లయితే సముచితమైన రీతిలో మ్యూజియంలో ప్రదర్శిస్తాము. మీరు కోరినట్లయితే వాటి నకళ్లు తీసుకొని తిప్పిపంపుతాము. ఎంతో అపురూపంగా మీరు పదిలపర్చుకున్న సుందరయ్యగారి జ్ఞాపకాల ఆనవాళ్లు జాతిమొత్తానికి ఉపయోగపడేందుకు దోహదపడమని విజ్ఞప్తి చేస్తున్నాము.

**సుందరయ్య విజ్ఞాన కేంద్రం,**
**హైదరాబాదు.**

పంపవల్సిన చిరునామా :

**కార్యదర్శి, సుందరయ్య విజ్ఞాన కేంద్రం, బాగ్‌లింగంపల్లి, హైదరాబాదు-500020. ఫోన్ : 04027667543**

# సిఐటియు మహాసభల సందర్భంగా రాష్ట్రంలో పలుజిల్లాల్లో శ్రామిక జనకవనాలు

జూలై 5-8 తేదీలలో హైదరాబాద్‌లో సిఐటియు రాష్ట్ర మహాసభలు జరుగుతున్న నేపథ్యంలో సాహితీస్రవంతి, సిఐటియు సంయుక్త ఆధ్వర్యంలో జూన్ నెలలో రాష్ట్ర వ్యాప్తంగా శ్రామిక జనకవనాలు నిర్వహించబడ్డాయి. ప్రపంచీకరణ, సామ్రాజ్యవాదం, అవినీతి, అధిక ధరలు వంటి సమస్యలపై కవిత్వం చదవాల్సిందిగా ఇచ్చిన పిలుపుకు కవులు ఉత్సాహంగా స్పందించారు. వివిధ జిల్లాల నుండి వచ్చిన జనకవనం వార్తలు దిగువనివ్వడం జరిగింది. మరికొన్ని ఖమ్మం, నల్గొండ, నిజామాబాద్, విజయవాడలలో జూన్ చివరివారంలో జరగబోతున్నాయి.

**కర్నూలు :** కర్నూలు జిల్లా సాహితీస్రవంతి, సిఐటియు సంయుక్తంగా కె.కె.భవన్‌లో జూన్ 17న కార్మిక జనకవనం నిర్వహించాయి. జిల్లా సాహితీస్రవంతి కార్యదర్శి కెంగార మోహన్ అధ్యక్షత వహించిన ఈ జనకవనంలో సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు, సిఐటియు జిల్లా అధ్యక్షులు ఎం.డి. అంజిబాబులు ప్రసంగించారు. కర్నూలు, నంద్యాల ప్రాంతాల నుండి పలువురు కవులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు. అవుల బసప్ప, సునీత, పులుసు నరసింహులు, పులిచేరి రమేష్, సుధీర్‌రాజు, శ్యామ్‌బాబు, రాజగోపాల్ తదితర కవులు తమ కవితలు చదివి వినిపించారు. ఎల్ఐసి నాయకులు చంద్రశేఖర్ రెడ్డి, ప్రజానాట్యమండలి నాయకులు మద్దిలేటి, ఎస్‌డబ్ల్యుఎస్ రాష్ట్ర నాయకులు ఈ సమావేశంలో సందేశం ఇచ్చారు.

**విజయనగరం :** విజయనగరం పట్టణంలో సిఐటియు ఆధ్వర్యంలో జూన్ 15న శ్రీశ్రీ వర్ధంతి, శ్రామిక జనకవనం జరిగింది. విజయనగరం జిల్లా సిఐటియు కార్యదర్శి తమ్మినేని సూర్యనారాయణ ఈ కార్యక్రమంలో పాల్గొని ప్రసంగించారు. కవి రెడ్డి రామకృష్ణ శ్రీశ్రీ సాహిత్య విశిష్టతపై మాట్లాడారు. అనంతరం ప్రజాగాయకుడు గండ్రేటి శ్రీనివాస్, రెడ్డిరామకృష్ణల ఆధ్వర్యంలో కవి గాయక సమ్మేళనం జరిగింది. బాల సుధాకర్ మౌళి, మానాపురం రాజాచంద్రశేఖర్, ఒరుగంటి రాజశేఖర్, మొయిద శ్రీనివాస్, చెళ్ళపిళ్ళ శ్యామల, ఇనుగంటి జానకి తదితరులు కవితలు చదివారు. బేబి శ్రేయ, చంద్రిక తదితరులు పాడిన పాటలు సభికులను అలరించాయి. సాహితీస్రవంతి బృందం చీకటి దివాకర్, కృష్ణారావు, పి.యస్. శ్రీనివాస్, సి. హెచ్.ఎస్.ఎస్. లక్ష్మి తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.




విజయనగరం జనకవనంలో ప్రసంగిస్తున్న తమ్మినేని సూర్యనారాయణ




జూన్ 15న కర్నూలులో జరిగిన సభలో మాట్లాడుతున్న జిల్లా సాహితీ స్రవంతి సంయుక్త కార్యదర్శి మహేష్

**విజయవాడ:** విజ్ఞానం, వికాసం, సంస్కృతి, సాహిత్యం... ఇవన్నీ 'శ్రమ' అనుభవాల నుంచి వచ్చినవేనని ప్రముఖ కవి ఖాదర్ మొహిద్దీన్ అన్నారు. జూలైలో జరగనున్న సిఐటియు రాష్ట్ర మహాసభలను పురస్కరించుకొని 'సాహితీ స్రవంతి' - 'సిఐటియు' విజయవాడ నగర కమిటీల ఆధ్వర్యంలో విజయవాడలో జూన్ 24న 'శ్రమ కవనం' కవితా పఠన కార్యక్రమం జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా విచ్చేసిన ఆయన మాట్లాడుతూ సమాజ నాగరిక వికాసానికి కేంద్రం మానవ శ్రమేనన్నారు. భాషను సృష్టించింది శ్రామికుడేనన్నారు. నేడు మానవ శ్రమ అనేక విధాలుగా దోపిడీకి గురవుతోందన్నారు. మానవ జాతిని దోపిడీ నుండి విముక్తి చేయడానికి కవులు, రచయితలు కృషి చేయాలని సూచించారు. శ్రమజీవి లేకుండా చేసే యాంత్రీకరణ ఎందుకని ఆయన ప్రశ్నించారు. సాహితీ స్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు కె. కేశవరెడ్డి మాట్లాడుతూ మనిషి జీవనంలో నిరంతర శ్రమ ఉందన్నారు. రచయితలు, కవులు ప్రజలను చైతన్యవంతంగా తీర్చిదిద్దేందుకు కృషి చేయాలన్నారు. ఈ కార్యక్రమానికి అధ్యక్షత వహించిన సాహితీ స్రవంతి జిల్లా అధ్యక్షులు కె. సత్యరంజన్, సిఐటియు నగర అధ్యక్షులు ఆర్. అజయ్‌కుమార్ మాట్లాడారు. సాహితీ స్రవంతి నగర కార్యదర్శి వి. ఉమామహేశ్వరి శ్రమ కవనం కవితా గోష్ఠి నిర్వహించారు. పలువురు కవులు తమ కవితలు చదివి వినిపించారు.

### ఇసిఐఎల్ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జనకవనం

సాహితీస్రవంతి ఇసిఐఎల్ ఆధ్వర్యంలో జూన్ 16న జనకవనం కార్యక్రమం జరిగింది. ఈ సభలో ఇసిఐఎల్ సిపిపిఎమ్ అధికారి, సాహిత్యవేత్త బులుసు భాస్కరరావును, ఆంధ్రప్రదేశ్ పత్రిక కథల పోటీలో బహుమతి పొందిన దుర్గుమహంతి మోహనరావును సాహితీస్రవంతి ఇసిఐఎల్ శాఖ సత్కరించింది. సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కార్యదర్శి జి. యాదగిరి రావు ఈ కార్యక్రమానికి ఆహ్వానం పలికారు. ఇసిఐఎల్ కర్మాగారం స్థాపనకు ఎ.ఎస్.రావు కృషి అందరికీ తెలిసిందేనని, ఆయన బాటలో బులుసు భాస్కరరావు విశిష్ట కృషి చేశారని అన్నారు. సాహితీస్రవంతి ఇసిఐఎల్ కార్యక్రమాలకు నిరంతరం ఆయన ప్రోత్సాహం అందించారని అన్నారు. ఈ సభకు సాహితీస్రవంతి ఇసిఐఎల్ కన్వీనర్ గిన్ని ఆనందరావు అధ్యక్షత వహించారు. అనంతరం జరిగిన జనకవనాన్ని తిరునగరి మురళి నిర్వహించారు. సభలో యాదగిరి రెడ్డి, వెంకన్న, జి. శివరామకృష్ణ, హెచ్.వి. స్వామి, నరహరి, లక్ష్మణ్ ప్రభు, గణపతి కృష్ణంరాజు తదితరులు పాల్గొన్నారు.

# తెలుగు సాహిత్యంలో శ్రీశ్రీ ఒక ప్రభంజనం

తెలుగు సాహిత్యంలో శ్రీశ్రీ ఒక ప్రభంజనం అని ఆంధ్ర సారస్వత పరిషత్ పూర్వ ప్రిన్సిపాల్ మోతుకూరి నరహరి అన్నారు. సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జూన్ 15న సుందరయ్య విజ్ఞానకేంద్రంలో జరిగిన శ్రీశ్రీ వర్ధంతి సభలో ఆయన మాట్లాడారు. తిక్కన, గురజాడ, వేమన శ్రీశ్రీకి మార్గదర్శకులని తెలిపారు. జగన్నాథ రథచక్రాలు వస్తున్నాయంటూ శ్రామికుల బతుకుల గూర్చి శ్రీశ్రీ కవిత్వం రాశారని అన్నారు. సభాధ్యక్షత వహించిన సాహితీస్రవంతి రాష్ట్ర కారదర్శి వొరప్రసాద్ మాట్లాడుతూ శ్రీశ్రీ సాహిత్యం నేటి పరిస్థితుకు మరింతగా వర్తిస్తుందని అన్నారు. ప్రపంచీకరణ పేరుతో పేదలకు వ్యతిరేకమైన విధానాలను పాలకులు అవలంబిస్తున్నారని అన్నారు. శ్రీశ్రీని స్మరించుకోవడమంటే సామాజిక బాధ్యతను రచయితలు గుర్తించడమేనని అన్నారు. ఈ సమావేశంలో సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ కార్యదర్శి జి. యాదగిరి రావు, సభ్యులు శాంతిశ్రీ, తంగిరాల చక్రవర్తి, వెంకటి, రాజా, శాస్త్రి, శ్రీశ్రీ అభిమానులు పాల్గొన్నారు.

**విశాఖలో:** మహాకవి శ్రీశ్రీ 29వ వర్ధంతి సందర్భంగా జూన్ 15న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో విశాఖపట్టణంలోని ఆర్.కె. బీచ్‌లో శ్రీశ్రీ విగ్రహం వద్ద ఆ మహాకవికి ఘనంగా నివాళులర్పించారు. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా ఎమ్మెల్సీ ఎం.వి.ఎస్. శర్మ, ప్రముఖ కవి మేకా రత్నరాజు హాజరై శ్రీశ్రీ విగ్రహానికి పూలమాల వేశారు. ఎమ్మెల్సీ శర్మ ఈ సందర్భంగా జరిగిన సభలో మాట్లాడుతూ ప్రపంచీకరణ నేపథ్యంలోని నేటి పరిస్థితులలో సామాజిక చైతన్యాన్ని పెంచే సాహిత్యం మరింత రావాల్సి అవసరం ఎంతైనా ఉందని అన్నారు. ప్రత్యామ్నాయ సంస్కృతి నిర్మించేందుకు కవులు, కళాకారులు మహాకవి శ్రీశ్రీ స్ఫూర్తితో ముందుకు రావాలని కోరారు. శ్రీశ్రీకి విశాఖపట్నం సముద్రం అంటే ఎంతో మక్కువని, అదేవిధంగా అధోజగత్ సహోదరులు అన్నా ప్రీతిపాత్రం అని, వారి గురించే ఆయన కలాన్ని



సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో విశాఖపట్టణం ఆర్.కె. బీచ్‌లో శ్రీశ్రీ విగ్రహం వద్ద నివాళి అర్పిస్తున్న ఎమ్మెల్సీ శర్మ, సాహిత్యాభిమానులు



హైదరాబాద్‌లో శ్రీశ్రీ వర్ధంతి సభలో మాట్లాడుతున్న మోతుకూరి నరహరి

నిశితంగా వాడారన్నారు. మేకా రత్నరాజు తదితరులు ప్రసంగించారు. అనంతరం సాహితీ స్రవంతి కార్యకర్తలు మహాప్రస్థానంలోని గేయాలను ఆలపించారు. కార్యక్రమానికి సాహితీ స్రవంతి నాయకులు ఎ.వి. రమణారావు ఆహ్వానం పలుకగగా, జి.వి.ఎస్. చలపతి ధన్యవాదాలు తెలియజేశారు. ఈ కార్యక్రమంలో సాహితీ స్రవంతి విశాఖ జిల్లా కన్వీనర్ ఎన్. రమణాచలం, ఎన్.వి.ఎన్.స్వామి, మురళీధర్, ప్రజానాట్యమండలి నాయకులు అరుణ్‌జీ, జి.వి.రమణలతో పాటు అధిక సంఖ్యలో సాహితీ అభిమానులు పాల్గొన్నారు.

**నిజామాబాద్‌లో:** నిజామాబాద్ పట్టణంలో మహిళా ఐటిఐ కళాశాల సమావేశమందిరంలో సాహితీస్రవంతి, ప్రజానాట్యమండలి సంయుక్త ఆధ్వర్యంలో జూన్ 15న శ్రీశ్రీ వర్ధంతి కార్యక్రమం జరిగింది. శ్రీశ్రీ చిత్రపటానికి పూలమాల వేసి నివాళులర్పించారు. తెలుగు సాహిత్యలోకంలో చిరస్మరణీయుడని, తెలుగు కవిత్వాన్ని మరోమలుపు తిప్పిన మహాకవి శ్రీశ్రీ అని కొనియాడారు. ప్రజానాట్యమండలి కన్వీనర్ సిర్పలింగం, శ్రీశ్రీ గీతాలను ఆలపించారు. ప్రభుత్వ ఐటిఐ కళాశాల ప్రిన్సిపాల్ రామమోహనరావు, జనవిజ్ఞాన వేదిక నాయకులు చెలిమెల రాజేశ్వర్, సాహితీస్రవంతి కన్వీనర్ మల్లవరపు విజయ, సీనియర్ కవి సి.హెచ్. మధు, ప్రజాకళామండలి కన్వీనర్ షహీద్ మియా, సిఐటియు నాయకురాలు విజయలక్ష్మి, తదితరులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

**ఆదోనిలో:** ఆధునిక కవులందరికీ మహాకవి శ్రీశ్రీ ఆదర్శమని ఆదోని సభలో వక్తలు కొనియాడారు. శ్రీశ్రీ వర్ధంతిని పురస్కరించుకుని కర్నూలు జిల్లా ఆదోని పట్టణంలో స్థానిక యు.టి.ఎఫ్. కార్యాలయంలో జూన్ 15న సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో ఆయన చిత్రపటానికి పూలమాలలు వేసి నివాళులర్పించారు. మహాకవి శ్రీశ్రీ రచనలు సామాజిక మార్పును ప్రతిబింబించాయని సాహితీ స్రవంతి జిల్లా కార్యదర్శి కెంగార మోహన్ అన్నారు. శ్రీశ్రీని ఆదర్శంగా తీసుకొని వర్తమాన అభ్యుదయ కవులందరూ మరింత ఎదగాలన్నారు. శ్రీశ్రీ కవిత్వంలో ప్రతి పాదములోనూ సామాజిక స్పృహ ఉంటుందని స్రవంతి డివిజన్ కార్యదర్శి నల్లారెడ్డి అన్నారు. కార్యక్రమానికి అధ్యక్షత వహించిన స్రవంతి డివిజన్ అధ్యక్షుడు ఆవుల బసప్ప మాట్లాడుతూ సామాజిక చైతన్యం కోసం అహర్నిశలూ కృషి చేసిన శ్రీశ్రీ జయంతి, వర్ధంతిని ప్రభుత్వం అధికారికంగా నిర్వహించాలని కోరారు. కార్యక్రమంలో స్రవంతి డివిజన్ నాయకులు భాస్కర్, నాగప్ప, నరసింహులు, వహీద్, పలువురు ఉపాధ్యాయులు పాల్గొన్నారు.


నిజామాబాద్‌లో సాహితీ స్రవంతి, ప్రజానాట్యమండలి ఆధ్వర్యంలో శ్రీశ్రీకి నివాళి


నంద్యాలలో శ్రీశ్రీ వర్ధంతి సభ


ఆదోనిలో చిత్రపటానికి పూలమాల వేసి నివాళి అర్పిస్తున్న దృశ్యం

**నంద్యాలలో:** నంద్యాల పట్టణంలోని శోభాలాడ్జి ఫంక్షన్ హాలులో జూన్ 16 న సాహితీస్రవంతి నంద్యాల ఆధ్వర్యంలో శ్రీశ్రీ సంస్మరణ సభ జరిగింది. సాహితీస్రవంతి డివిజన్ నాయకులు ఎం.శ్రీనివాసమూర్తి, మాదాల శ్రీనివాసులు, డి. ఆల్ఫోన్సెస్‌ల నిర్వహణలో జరిగిన ఈ సభలో సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు, సాహిత్యవేత్త డా. మధుసూదన్, కల్లూరి ఆనందరావు, లలితా సరస్వతి, గొట్టిముక్కల సుబ్రహ్మణ్యశాస్త్రి, గెలివి సహదేవుడు, రామకృష్ణా విద్యాసంస్థల అధినేత జి. రామకృష్ణారెడ్డి, కెసి వెంకటేశం, దుద్యాల పుల్లయ్య, అడ్వకేట్ శంకరయ్య, తదితరులు పాల్గొన్నారు. ఈ సందర్భంగా మాట్లాడిన వక్తలు శ్రీశ్రీ ఈ శతాబ్దం నాది అని సగర్వంగా చెప్పుకున్న కవి అని కొనియాడారు. మహాప్రస్థానం, ఖడ్గసృష్టి, అనంతం వంటి పుస్తకాలు సామాజిక చైతన్యం కల్గించాయని అన్నారు. శ్రీశ్రీ రాసిన సినీపాటలు ప్రజల హృదయాలలో నిలిచిపోయాయని అన్నారు. ఈ కార్యక్రమంలో తెలుగు ఉపన్యాసకులు చెంచయ్య, దస్తగిరి, మణిశేఖర్ రెడ్డి, రామసుబ్బయ్య, దిబ్బారావు, మల్లిఖార్జున, కరీముద్దీన్, కేశవయ్య, కృష్ణమూర్తి, లోకేష్ మర్రెడ్డి, బాలు, బాలవెంకట్, లక్ష్మణ్ తదితరులు పాల్గొని శ్రీశ్రీకి నివాళి అర్పించారు.

**నంద్యాల డివిజన్ సాహితీస్రవంతి కమిటీ ఏర్పాటు**

సాహితీస్రవంతి నంద్యాల డివిజన్ కమిటీ సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి జంధ్యాల రఘుబాబు సమక్షంలో ఏర్పాటయ్యింది. గౌరవ సలహాదారుగా జి. సుబ్రహ్మణ్య శాస్త్రి, గౌరవ అధ్యక్షునిగా కళామురళి, అధ్యక్షులుగా ఎం. శ్రీనివాసమూర్తి, ఉపాధ్యక్షులుగా డి. ఆల్ఫోన్సెస్, ప్రధాన కార్యదర్శిగా మాదాల శ్రీనివాసులు, సహాయ కార్యదర్శిగా చెంచయ్య, ప్రత్యేక ఆహ్వానితులుగా కల్లూరి ఆనందరావు, కమిటీ సభ్యులుగా లింగస్వామి, దస్తగిరి, మల్లిఖార్జున, అబ్దుల్ సమ్మద్‌లు ఎన్నికయ్యారు. ఈ కమిటీ ఆధ్వర్యంలో నంద్యాల డివిజన్‌లో పలు సాహిత్యకార్యక్రమాలు నిర్వహించనున్నట్లు జంధ్యాల రఘుబాబు తెలిపారు. •

# సమకాలీనతకు అద్దంపట్టే కన్యాశుల్కం

మహాకవి గురజాడ రచించిన 'కన్యాశుల్కం' నాటి ప్రాచీన పరిస్థితుల నుంచి నేటి సమకాలీనతకూ ఎంతో ఉపయుక్తంగా ఉంటుందని 'సాహిత్య ప్రస్థానం' మాసపత్రిక సంపాదకులు తెలకపల్లి రవి అన్నారు. తన చుట్టూ ఉన్న సమాజంలోని సంఘర్షణలనూ, సంకేతాలనూ గుర్తించిన గురజాడ 'కన్యాశుల్కం' నాటకం ద్వారా ఆయా పాత్రలను ఆధునిక సమాజానికి అందజేశారని అన్నారు. కేంద్ర సాహిత్య అకాడమీ ఆధ్వర్యాన విజయనగరంలో జూన్ 24న సాహిత్య సమ్మేళనంలో "సమకాలీన భారతీయ నాటకాలలో కన్యాశుల్కం స్థానం" అంశంపై ఆయన ప్రసంగించారు. గురజాడ రచనల్లో పాతకాలం నాటి సాంప్రదాయంలోని గొప్పదనాన్ని గౌరవిస్తూనే కాలం చెల్లిన వాటిని నిర్భయంగా త్యజించారనీ చెప్పారు. ఆంగ్లం, సంస్కృతం, బాగా తెలిసి కూడా అచ్చ తెలుగు నుడికారాలైన "దేశమంటే మట్టికాదోయ్... దేశమంటే మనుషులోయ్..." తదితర పదబంధాలలో తెలుగుదనం ఉట్టిపడేలా చేశారనీ అన్నారు. సామాజిక దురాచారాలను ఎలా ఎదుర్కొనాలో చెప్పడానికి చక్కని నమూనా 'కన్యాశుల్కం' అనీ, అందుకే భారతీయ సాహిత్యంలో మహా మానవ ప్రస్థానంగా రూపుదిద్దుకుందనీ కొనియాడారు.

"కన్యాశుల్కం" నాటకంపై కేంద్ర సాహిత్య అకాడమీ ఆధ్వర్యంలో మూడు భాగాలుగా జరిగిన ఈ కార్యక్రమంలో మొదటి విభాగంలో తెలకపల్లి రవి, రెంటాల శ్రీ వెంకటేశ్వరరావు, సిహెచ్. లక్ష్మణ చక్రవర్తి, రెండవ సమావేశంలో కాట్రగడ్డ వెంకటేశ్వరరావు, కాళిదాసు పురుషోత్తం, రావి కొండలరావు, వృద్ధుల కల్యాణ రామారావు, మూడవ దానిలో కవనశర్మ, రామతీర్థ, జి.ఎస్. చలం, రామసూరి పాల్గొని ప్రసంగించారు. ప్రారంభ సమావేశంలో చాట్ల శ్రీరాములు కీలకోపన్యాసం చేశారు. జె.వి. రమణమూర్తి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ముగింపు సమావేశంలో చాగంటి తులసి, గొల్లపూడి మారుతీరావు, రామినాయుడు, ఎన్.కె. బాబు పాల్గొన్నారు. •



కేంద్ర సాహిత్య అకాడమీ సాహిత్య సమ్మేళనంలో మాట్లాడుతున్న తెలకపల్లి రవి. చిత్రంలో లక్ష్మణ చక్రవర్తి, యు. నరసింహమూర్తి

# రవీంద్రుని జయంతి

సాహితీస్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో రవీంద్రుని జయంతి కార్యక్రమం సుందరయ్య విజ్ఞానకేంద్రంలోమే 27న జరిగింది. ఈ సందర్భంగా 'రవీంద్రుడు-సాహిత్యం' అంశంపై సదస్సు జరిగింది. ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా సాహితీస్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి హాజరయి ప్రసంగించారు. ఆయన మాట్లాడుతూ శాంతినికేతన్ రూపంలో ఒక ప్రత్యామ్నాయ విద్యావ్యవస్థను రవీంద్రుడు ఏర్పాటు చేశాడని అన్నారు. రెండు దేశాలకు ఆయన జాతీయ గీతాన్ని అందించడం గొప్ప విషయమన్నారు. మహాకవి గురజాడ రవీంద్రునితో ఉత్తరప్రత్యుత్తరాలు సాగించారనీ, రవీంద్రుడు గురజాడను రచనల విషయంలో ప్రోత్సహించారని తెలిపారు. ప్రకృతిని రవీంద్రుడు తన సాహిత్యంలో అద్భుతరీతిలో ఆవిష్కరించారన్నారు. మనుష్యులు లేని ప్రకృతి ఊహించలేమని ఆనాడే రవీంద్రుడు తెలిపారని అన్నారు. ఒక మానవీయ స్పర్శతో కూడిన సాహిత్యాన్ని రవీంద్రుడు అందించాడని అన్నారు. సభాధ్యక్షత వహించిన వి.వి.ఆర్. శాస్త్రి మాట్లాడుతూ బెంగాలీలకు అత్యంత గౌరవనీయుడు రవీంద్రుడని అన్నారు. రవీంద్రుని ప్రస్తావన లేకుండా బెంగాలీలకు రోజు గడవదు అన్నారు. సాహిత్యకారులకే సాహిత్యకారుడు అని కొనియాడారు. అన్ని సాహిత్య ప్రక్రియలు ఇష్టమే నంటూ కవిత్వం బాగా ఇష్టమని రవీంద్రుడు అన్నారని తెలిపారు. అనంతరం జరిగిన జనకవనాన్ని వెంకటి సమన్వయం చేశారు. పలువురు కవులు తమ కవితలు చదివి వినిపించారు. నాగశిరీష పాడిన పాటలు అలరించాయి. ఈ కార్యక్రమంలో జి. యాదగిరి రావు,గేరా, ఆలువాల సురేష్, తంగిరాల చక్రవర్తి, వొరప్రసాద్, పొత్తూరి సుబ్బారావు, రత్నా మహీధర్, నాగశిరీష,




హైదరాబాద్‌లోని మే 27న జరిగిన రవీంద్రుని జయంతి సభలో మాట్లాడుతున్న తెలకపల్లి రవి

గేరా, శాంతిశ్రీ, ఆచార్య నరేంద్ర, మోపిదేవి రాధాకృష్ణ తదితరులు పాల్గొన్నారు.

### భద్రాచలంలో రవీంద్రుని జయంతి

భద్రాచలం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో స్థానిక లిటిల్ ఫ్లవర్ విద్యాసంస్థల ప్రాంగణంలో జూన్ 7న విశ్వకవి రవీంద్రుని జయంతి కార్యక్రమం జరిగింది. ఆసియాఖండంలోనే తొలి సాహిత్య నోబుల్ బహుమతి అందుకున్న విశ్వవిఖ్యాత సాహిత్యవేత్త రవీంద్రుడు అని వక్తలు కొనియాడారు. 'గోరా' వంటి నవలలు, 'చిత్రాంగధ' వంటి నాటకాలు సృష్టించారన్నారు. శాంతినికేతన్ స్థాపించి విద్యారంగాన్ని ప్రభావితం చేసారన్నారు. చిత్రకళా రంగంలో అద్భుత ప్రతిభ ప్రదర్శించి బహుముఖ ప్రజ్ఞావంతుడుగా ఖ్యాతిపొందారన్నారు. ఈ కార్యక్రమంలో మాగంటి సూర్యం, మాల్యశ్రీ, తాతోలు దుర్గాచారి, శ్రీధిరాల వెంకటాచారి, యం.రాంప్రసాద్, వి. రాంబాబు, ఆర్.ఎస్. రావు, జి. రామరాజు, తదితరులు పాల్గొన్నారు.

# 'కంచి మేకలు కథల సంపుటి హిందీ అనువాదం 'జంగ్' ఆవిష్కరణ'

విజయనగరం సాహితీస్రవంతి ఆధ్వర్యంలో జూన్4న గురజాడ స్వగృహంలో ఆరుద్ర వర్ధంతి కార్యక్రమం జరిగింది. సభాధ్యక్షులు కృష్ణారావు మాట్లాడుతూ ఆరుద్ర బహుముఖ ప్రజ్ఞాశాలి అని కొనియాడారు. ఆధునిక తెలుగు సాహిత్యాన్ని అభ్యున్నతీకరించడానికి జీవితాన్ని పణంగా పెట్టిన మహావ్యక్తి ఆరుద్ర అన్నారు. సుప్రసిద్ధ కవిగా, పరిశోధకుడిగా, విమర్శకుడిగా, అనువాదకుడిగా అనన్యసామాన్యమైన కృషి ఆరుద్ర చేశారని అన్నారు. కార్యక్రమంలో ముఖ్య అతిథిగా పాల్గొన్న సీనియర్ రచయిత గంటేడ గౌరునాయుడు మాట్లాడుతూ ఆరుద్ర సాహిత్యం సామాజిక చైతన్య సాధనమని అన్నారు. 'నువ్వెక్కవలసిన రైలు ఒక జీవితకాలం లేటు' అంటూ కాలాన్ని నిర్వచించిన తీరు ఆధునిక తెలుగు కవులకు ఆదర్శమని, ఆరుద్ర సాహిత్యం ఎంతగానో ప్రభావితం చేసిందని అన్నారు. ఇదే సమావేశంలో శిరంశెట్టి కాంతారావు 'కంచిమేకలు' కథా సంకలనం హిందీ అనువాదం 'జంగ్' పుస్తకాన్ని బాలల విభాగంలో కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు పొందిన పుణ్యప్రభాదేవి ఆవిష్కరించారు. తెలుగు నుండి ఒక మంచి పుస్తకాన్ని హిందీలోకి



'జంగ్' హిందీ కథల సంపుటి ఆవిష్కరణ

అనువాదం చేసిన ఇనుగంటి జానకిని ఆవిడ అభినందించారు. 'జంగ్' పుస్తకాన్ని పి.వి.యల్. సుబ్బారావు సమీక్షించారు. 'కంచిమేకలు' కథా రచయిత శిరంశెట్టి కాంతారావును జిల్లా సాహితీస్రవంతి కన్వీనర్ చీకటి దివాకర్ సభకు పరిచయం చేస్తూ, ప్రపంచీకరణ దుష్ఫలితాలు, మతోన్మాద విధ్వంసం ఎంత విపరీతంగా ఉంటాయో కాంతారావు గారి కథల్లో కనబడతాయని అన్నారు. ఇనుగంటి జానకి, శిరంశెట్టి కాంతారావుల స్పందనల అనంతరం పి.యస్. శ్రీనివాస్ వందన సమర్పణతో కార్యక్రమం ముగిసింది.




డా॥ ఎం. వికాస్ రచించిన 'చిరునవ్వు' అనే దంత వైద్య గ్రంథాన్ని హైదరాబాద్‌లోని రవీంద్రభారతిలో డా॥ మంగళంపల్లి బాలమురళీకృష్ణ ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో జీడిగుంట వెంకటరావు, పూర్వ చీఫ్ సెక్రటరీ కాకి మాధవరావు, సభాధ్యక్షులు డా॥ ఎన్. గోపి, ఆల్ ఇండియా డెంటల్ కౌన్సిల్ అధ్యక్షుడు డా॥ శ్రీధరశెట్టి, డా॥ ఎం.ఎస్. గౌడ్, డా॥ టి. శంకర్, శ్రీమతి ఎం. విజయలక్ష్మి



రమణ వెలమకన్ని రచించిన 'జీవన సందర్భాలు' నానీల సంపుటిని హైదరాబాద్‌లోని శ్రీ త్యాగరాయ గానసభలో డా॥ సి. నారాయణరెడ్డి ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో అభినందన భవాని, కళాదీక్షితులు, కవి రమణ వెలమకన్ని, సభాధ్యక్షులు డా॥ ఎన్. గోపి, డా॥ వై. రామకృష్ణారావు



జూన్ 3 ఆదివారం కడప పట్టణంలో ఆర్తి హోంలో 'ఒక దీపం వెలిగింది' వికలాంగుల జీవన పథం పుస్తకావిష్కరణ సభలో పాల్గొన్న నేటినిజం సంపాదకులు బైస దేవదాస్‌కు జ్ఞాపికను అందజేసి సత్కరిస్తున్న జిల్లా కలెక్టర్ సతీమణి డా॥ పద్మా అనిల్‌కుమార్, వేదికపై యోగివేమన విశ్వవిద్యాలయం వైస్ ఛాన్సలర్ ఆచార్య ఎం. రామచంద్రారెడ్డి, అలపర్తి పిచ్చయ్య చౌదరి, శ్రీమతి బి. దుర్గాకుమారి



చీరాల సాహితీ స్రవంతి వారి రజతోత్సవ వేడుకలలో వడలి రాధాకృష్ణ కథా సంకలనం "చీకటి పున్నమి"ని ఆవిష్కరిస్తున్న నవ్య వారపత్రిక సంపాదకులు ఎ.ఎన్. జగన్నాథశర్మ. చిత్రంలో సాహితీ స్రవంతి ప్రధాన కార్యదర్శి పసుమర్తి నరశింగరావు, కలిమిశ్రీ, పొన్నూరు వేంకట శ్రీనివాసులు, కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి, సంస్థ అధ్యక్షులు కాకరపర్తి వెంకటేశ్వర్లు, చివుకుల రామమోహన్, కట్టా వినయ్‌కుమార్, ఎం.వి.ఎస్. శాస్త్రి, డా॥ వి.కె. భాస్కరరావు, ముప్పల శివప్రసాదరావు



తెనాలిలో ప్రముఖ కథా రచయిత వల్లూరు శివప్రసాద్‌కు తుమ్మల వెంకట్రామయ్య సాహితీ సత్కారాన్ని అందిస్తున్న దృశ్యం. వేదికపై అరసం రాష్ట్ర అధ్యక్షులు పెనుగొండ లక్ష్మీనారాయణ, సి.పి.ఐ. నాయకులు ముప్పాళ్ళ నాగేశ్వరరావు, నటులు ఎం. కృష్ణమోహన్, రచయిత చెరుకుమల్లి సింగా తదితరులు



చిత్రంలో ముఖ్య అతిథులు నల్లూరి వెంకటేశ్వర్లు, పెనుగొండ తిరుపతి లక్ష్మీనారాయణ, పురస్కార గ్రహీతలు మరియు పురస్కార ప్రదాతలు

# స్పందన

జూన్ 2012 సాహిత్య ప్రస్థానం సంచికలోని కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి 'ఆకు కూరలమ్మి' కవిత లోని ప్రతి పదం గుండె లోతుల్లోంచి పుట్టినది అన్పించింది. సుప్రభాతం వినిపించినట్లు ఓ వైతాళిక ధ్వని! గమకాలు పోతూ, గమ్యాన్ని వెతుకుతూ "ఆకు కూరలమ్మా! ఆకు కూరలోయ్!" అంటూ సాగే కూరలమ్మి కేకలకు రాగసుధలుండవు. కడుపు ఆర్తనాదం వినిపించిందీ కవికి. "ఆగి ఆగి సాగుతూ ఆకాశాన్ని తాకుతూ, బతుకు భారాన్ని మోసే పాట, ఆర్తి, ఆర్ద్రత, ఆత్మ విశ్వాసం మిళితమై, హృదయాల్ని కదిలించే పాట!" ఎంతటి వేదనతో ఆలకించి ఉంటాడో కవి! 'వంటిళ్ళకు చెవులు మొలిపించే పాట! పొద్దున్నే కాఫీకప్పులు పక్కనబెట్టి, చిల్లర డబ్బులు చేతబట్టుకుని వంగి లేస్తూ ఆ పాటను ఆలకిస్తూ... అవలోకిస్తూ, వాంఛిత హృదయాలతో ఎదురుచూసే ఇల్లాళ్ళ సందోహం" ఎంతటి పదవిన్యాసం కవితలో! ఇంటి ఇల్లాళ్ళు ఆకుకూరలమ్మి కోసం ఎలా ఎదురుచూస్తున్నారో వర్ణించారు కొండ్రెడ్డి వెంకటేశ్వర రెడ్డి. 'ఆ పాటలో దాగున్న శ్రమైక చైతన్యపు సింగారం ముందు, ఆర్థిక పొగరుతో అలంకార ప్రాయమైన సంగీత కచేరీలు తలదించుకుంటాయ్" ఇందులో ఎంతటి సౌహార్థత! 'ఏటేటా పంట నష్టం! బతుకు కష్టం! విస్తరిస్తున్న అప్పుల ఊబి! ఏమీ పాలుపోని మొగుడు మందుకు బానిసయ్యాడు. మద్యం మాఫియాలు పండగ చేసుకుంటున్నాయి. ఈ కవితలో రైతుల కష్టాలు కవి హృదయ విదారకంగా వర్ణించారు. "ఎంత లేకున్నా, కాయాన్ని కవ్విస్తున్న యవ్వనంతో, ఒయ్యారాలు పోతూ నడుస్తుంటే...' కామ వాంఛ వెదజల్లేందుకు కార్పోరేటు వ్యవస్థ నిర్వహించే అందాల పోటీల్లో, ర్యాంప్‌పై కృత్రిమ హావభావాలు వలికిస్తూ నడిచి పోయే నవ నాగరీక యువతుల సౌందర్యం 'ఆకు కూరలమ్మి' శ్రామిక అందాల ముందు చిన్నబోవాల్సిందే! 'ఆత్మాభిమానాన్ని నమ్ముకుని, ప్రకృతి వైపరీత్యాన్ని ఎదుర్కొనే సేద్యగానికి చేయూతనివ్వని ప్రభుత్వ వైఫల్యానికి ప్రతీక 'ఆకు కూరలమ్మి'!

**- ఆచార్య నరేంద్ర**



మే 29న హైదరాబాద్‌లో శ్రీ త్యాగరాయగానసభలో డా॥ ద్వా.నా. శాస్త్రిని "విశ్వసాహితీ ప్రతిభా పురస్కారంతో సత్కరిస్తున్న డా॥ పోతుకూచి సాంబశివరావు, ఆచార్య మసన చెన్నప్ప. చిత్రంలో డా॥ బి. జయరాములు, పి.వి. బ్రహ్మం, కళా వేంకట దీక్షితులు



శ్రీమతి ఎన్. అరుణ రచించిన 'నిరీక్షణే ఒక గాయం' కవితా సంపుటిని హైదరాబాద్‌లో డా॥ సి. నారాయణరెడ్డి ఆవిష్కరిస్తున్న దృశ్యం. చిత్రంలో కిన్నెర ఆర్ట్ థియేటర్స్ అధినేత మద్దాలి రఘురాం, ఓల్గా, కె. శివారెడ్డి, కవయిత్రి అరుణ, ఎం. నారాయణశర్మ, కళాదీక్షితులు



గుంటూరుజిల్లా రచయితల సంఘం సాహిత్య పురస్కారాల సభలో నూర్ భాషా రహంతుల్లా రచించిన పుస్తకం "తెలుగు దేవభాషే" ఆవిష్కరణ. జిల్లా రచయితల సంఘం అధ్యక్షులు సోమేపల్లి వెంకట సుబ్బయ్య పుస్తకాన్ని ఆవిష్కరించారు. చిత్రంలో పాపినేని శివశంకర్, కొప్పర్తి, చినుకు మాసపత్రిక సంపాదకులు నండూరి రాజగోపాల్, గంధం యాజ్ఞవల్క్యశర్మ, అరసం రాష్ట్ర అధ్యక్షులు పెనుగొండ లక్ష్మీనారాయణ, కోసూరి రవికుమార్, సిరికి స్వామినాయుడు, బి.వి.వి. ప్రసాద్, సయ్యద్ నసీద్ అహ్మద్



మే 25న జరిగిన 'చెలిమి' సాంస్కృతిక సంస్థ శ్రీ త్యాగరాయ గానసభలో రచయిత్రి రత్నా మహీధర్‌కు ఆచార్య ఆత్రేయ స్మారక పురస్కారం సి. నారాయణరెడ్డిగారిచే అందజేస్తున్న దృశ్యం. చిత్రంలో చెలిమి కార్యదర్శి రామారావు, రత్నా మహీధర్, సి.నా.రె., కళా దీక్షితులు

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

## గుఱ్ఱం జాషువా

28.09.1895 - 24.07.1971



కులమతాలు గీచుకొన్న గీతలజొచ్చి
పంజరాన గట్టువడను నేను
నిఖిల లోకమెట్లు నిర్ణయించిన
నాకు తరుగు లేదు విశ్వనరుడ నేను
- గుఱ్ఱం జాషువా

SAHITYA PRASATHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/10-12



# ప్రజాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు



వెల: రూ. 40/-



వెల: రూ. 200/-



వెల: రూ. 25/-



వెల: రూ. 30/-



వెల: రూ. 40/-



వెల: రూ. 40/-



వెల: రూ. 35/-



వెల: రూ. 20/-



వెల: రూ. 150/-



వెల: రూ. 20/-



వెల: రూ. 50/-



వెల: రూ. 100/-



వెల: రూ. 20/-



వెల: రూ. 150/-



వెల: రూ.200/-



వెల: రూ. 35/-



వెల: రూ. 40/-



వెల: రూ. 20/-



వెల: రూ. 50/-



వెల: రూ. 150/-

**ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136**



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02 139 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yas |
| వెనుక అట్ట | yas |
| మొత్తం పేజీలు | 51 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | kNaveen |
| పేజీలు విడదీసినది | kNaveen |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు పరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | GOOD |